

యమగర్వభంగము అను.

# మార్కండేయనాటకము

సుప్రసిద్ధ నాటక గ్రంథకర్తలగు

## కేతవరపు రామకృష్ణశాస్త్రిచే

రచియింపఁబడియె.


ప్రకాశకులు

**కందుల గోవిందం,**

బెజవాడ, కృష్ణాజిల్లా

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే
కాకినాడ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.





[[illegible]] 1925. [వెల 0 12 0

# ఆంధ్రనాటకములు.

| | | | |
|---|---|---|---|
| కనకతారనాటకం చం॥ కే॥ | 1- 4 | పారిజాతాపహరణము చి॥ ల॥ | 0- 8 |
| సంగీత లంకాదహనం దో॥ సీ॥ | 1-10 | ప్రసన్న యాదవము | 0- 8 |
| పాదుకా పట్టాభిషేకము | 0-12 | చతుర చంద్రహాస | 0- 8 |
| వేశ్యాహితబోధిని | 1- 0 | స్వప్న వాసవదత్త | 0- 6 |
| వేశ్యామధురం పా॥ III | 0- 8 | పార్వతీ పరిణయం | 0- 6 |
| పాండవజననము రా॥ నా॥ | 0-10 | సంగీత సావిత్రి చ॥ మా॥ | 1- 0 |
| పాండవప్రవాసము ,, | 0-12 | సంగీత ప్రహ్లాద | 0-12 |
| పాండవోద్యోగము ,, | 0-12 | సత్యవిజయము | 1- 0 |
| పాండవ విజయము ,, | 0-12 | పద్మవ్యూహము | 1- 0 |
| పాండవాశ్వమేధము ,, | 0-12 | శ్రీకృష్ణరాయబారము | 0-14 |
| అహల్యాశాపవిమోచనము ,, | 0-12 | సంగీత స్త్రీ సాహసము | 0-12 |
| శాంతామతి ,, | 0-12 | భూలోకరంభ | 1- 0 |
| సంపూర్ణ రామాయణము కో॥ స॥ | 1- 4 | చంద్రకాంత | 0-10 |
| సంపూర్ణాంజనేయము ,, | 1- 0 | శ్రీరామ జననం దో॥ సీ॥ | 0- 8 |
| బిల్వమంగళచింతామణి చ॥ భూ॥ | 1- 0 | విషాద సారంగధర | 1- 6 |
| సంగీత గులాబకావళి ,, | 1- 0 | పాదుకాపట్టాభిషేకము | 1- 4 |
| విజయభాస్కరము జ॥ ల॥ | 1- 0 | పాంచాలీస్వయంవరము | 1- 4 |
| శ్రీరామపట్టాభిషేకము ,, | 1- 0 | రోషనార శివాజి | 1- 4 |
| జయంతజయపాలము బ॥ కో॥ | 0- 8 | ప్రమీలార్జునీయము | 1- 4 |
| కుశలవ పట్టాభిషేకము రా॥ గా॥ | 1- 0 | చంద్రహాస | 1- 4 |
| పాంచాలీమానసంరక్షణం | 1- 0 | సావిత్రీచిత్రాశ్వము | 1- 4 |
| సంగీత మార్కండేయ | 0-12 | మోహినీ రుక్మాంగద | 1- 4 |
| భక్తరామదాసు కే॥ శే॥ | 1- 0 | వరూధిని | 1- 4 |
| సంగీత కృష్ణలీల సం॥ శం॥ | 1- 0 | బృహన్నల | 1- 4 |
| సంగీత విష్ణులీల ప॥ మా॥ | 1- 0 | చిరకారి | 1- 4 |
| ఊర్వశీశాపవిమోచనము | 1- 0 | లవకుశ కొ॥ సు॥ | 1- 8 |
| కంఠాభరణము పా॥ ల॥ | 1- 0 | రామదాసు డి॥ గో॥ | 1- 4 |
| హనుమద్రామసంగ్రామం | 0-12 | చతురచంద్రహాస దో॥ సీ॥ | 0- 8 |
| గయోపాఖ్యానం చి॥ ల॥ | 0- 8 | పాండవాజ్ఞాతవాసం | 0- 8 |

కందుల గోవిందం,

బుక్కు సెల్లరు అండ్ పబ్లిషర్,

బెజవాడ, కృష్ణాజిల్లా.

శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః

# యమగర్వభంగము

అను

# మార్కండేయనాటకము.

ఇది

సుప్రసిద్ధ నాటకగ్రంధకర్త యగు

కేతవరపు రామకృష్ణశాస్త్రిచే

రచింపబడియె.

పబ్లిషరు

కందులగోవిం[illegible]

బెజవాడ, కృష్ణాజిల్లా.



మొదటికూర్పు 1000 ప్రతులు.



కాకినాడ:

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1925.

 [వెల 0—12—0

# పాత్రములు.

## పురుషులు.

మృకండుఁడు.

వశిష్ఠుఁడు.

నారదుఁడు.

జాబాలి.

బ్రహ్మ.

యముఁడు.

శివుఁడు.

మార్కండేయులు.

నంది.

భృంగి.

మునిబాలకులు.

చిత్రగుప్తుఁడు.

యమభటులు.

## స్త్రీలు.

మరుద్వతి.

కాత్యాయని.

శీలవతి.

సుశీల.



# నాంది

మ. శ్రీమధు ల్గొల్వఁగఁ బారతీరమణి తా ♦ వామాంక భాగంబునన్
రమణీయస్థితినొప్ప శ్వేతగిరిపై ♦ రాజిల్లుతన్మూర్తి సం
భ్రమభీతు ల్వనివైవ వేఁడుకొను మా ♦ ర్కండేయ శోకధ్వనిన్
విమలుండై విని వాని గాచుశివుఁడా ♦ ప్రేమ న్మిముగాంచుతన్.

[నాంద్యంతమున సూత్రధారుఁడు సభ్యులపై పుష్పాంజలింజల్లి.]

సూత్ర—పూజ్యులైన యోసభ్యులారా! మే మీ దినమున ప్రహ్లాద, శివాజీ, రామదాస, పాంచాలీమానసంరక్షణాది సుప్రసిద్ధ నాటక గ్రంథకర్తయు పండితజనవిధేయుండును లక్ష్మీనరసింహాచల గురుతృతీయ పుత్త్రుండును నగు కేతవరపు రామకృష్ణశాస్త్రిచే రచింపఁబడిన మార్కండేయ నాటకము నాడఁదలంచితిమి గావున మాప్రదర్శనమం దెట్టి లోపములున్నను దయతో క్షమింతురుగాక. మఱియును గ్రంథకర్త మీతో నిట్లు మనవి జేసికొనుచున్నాఁడు.

గీ. బాలుఁడను శాస్త్రవిజ్ఞాన ♦ పరమశక్తి
హీనుఁడను నాదు గ్రంథమం ♦ దెట్టివైన
తప్పులుండిన మన్నింప ♦ దండ మిదుదు
ధన్యమతులార విబుధావ ♦ తంసులార.

మా కింక సెలవొసంగుడు.

(నిష్క్రమించును.)





శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః

# యమగర్వభంగము

అను

# మార్కండేయ నాటకము.



ప్రథమాంకము.



## ప్రథమరంగము.

[అరణ్యము. నారదుఁడు పాడుచు ప్రవేశించును]

1 వ అనుబంధము.

నార. —

గీ. గర్వపూరితులై నట్టి ♦ కలుషమతుల
గర్వభంగంబుఁ గావించి ♦ క్ష్మాస్థలమున
సద్గుణగణంబు నెల్లను ♦ వెలుఁగఁజేసి
సత్పథంబుల నిల్పుటే ♦ శక్తి కాదె.

భువనములయం దెంతెంతవారికిని జగడంబులఁ గల్పించి దుష్టులఁ బరిభవించి సాధువులకుఁ గీర్తిఁ దెప్పించు నన్ను లోకులు కలహభోజనుఁడన్నను జగడంబులఁ బెట్టెడి సన్యాసియన్నను తంపులమారి తపసియన్న నంమరుగాక. పెట్టవలసిన జగడంబులఁ బెట్టనేవలయును. దుర్మార్గశిక్షణము సాధుజనరక్షణము లోకోద్ధరణమే ప్రధానముగాఁగల నాకలహములను జూచి సజ్జనులు నిందింతురా? ఆహా! నాకింతకన్న యానంద

మేదికలదు. త్రిమూర్తు లంతవారిని సైతము కలహజాలమునఁబడద్రోసి వారలు ఘోరముగఁ బోరాడుచుండ శమమునుండి బ్రహ్మానందసుఖము ననుభవించు నాకింతకన్న వేఱభాగ్య మున్నదా? అట్టినన్ను సరకుఁ గొనక నీ యముఁ డింత వివేకహీనుఁడై పలుకవచ్చునా? చతుర్దశ భువనములయందును పుణ్యపాపములను విమర్శించువాఁడు తానట తానొప్పుకొనినఁగాని యెంతటి మహాపుణ్యుండును బావనుఁడే కాఁడట. ఎట్టి జీవియైనను మరణసమయమునకుఁ దనలోకమునకు వచ్చియే తీరవలయునట. బ్రహ్మతన కెంత యధికార మొసంగియున్నను దానిట్లు గర్వపూరితుఁడై వివేకము చెడి పలుకవచ్చునా? ఇంత యాత్మశ్లాఘాపరాయణు నూరక విడువరాదు. వీని దుర్బుద్ధినివదలఁగొట్టి గర్వభంగంబును గావించియే తీరవలయును. ఇందుల కెట్లు పన్నవలయును (ఇంచుక యోజించి) ఇట్లగుగాక. మృకండుఁ డనపత్యుఁడగుట బ్రహ్మలోకావలోకన కుతూహలుండై చని తద్ద్వారపాలక తిరస్కృతుండై తనపర్ణశాలం జేరి చింతించుచున్నవాఁడు. నే నిప్పు డాతని కడ కేగి సంతానముకలుగు మార్గమును జూపించి వచ్చెదగాక. పైకార్యము తర్వాత యోజింతము. ఇదే పోయెదను.

(నిష్క్రమించును.)

2 వ అనుబంధము.

---

ద్వితీయరంగము:—పర్ణశాల.

మరుద్వతీ మృకండులు విచారముతో గూర్చుండియుందురు.

(3 వ అనుబంధము.)

మృకం—ప్రాణేశ్వరీ! నేనేమి చేయుదును? ఏనాఁడైన నిట్టియవమానము ప్రాప్తింపనున్నదనుట నూహించితినే? సుఖములను బరిత్యజించి యాసలనన్నింటిని విసర్జించి మనోవాంఛలఁ జెకలించి

నిశ్చలచిత్తముతోఁ దపము నొనర్పఁ జాలియు నట్టిభాగ్యమునం దఁజాలనైతిని. చిన్నతనము నుండియుఁ గనుభక్తిమై గురుశు శ్రూషయొనర్చి సాంగోపాంగముగ వేదాధ్యయన మొనర్చి తప స్విసై నందులకు ఫలిత మీనాటి కిట్టి పరాభవాగ్ని పాలగుట యేగా!

మరు—నాథా! నాదుఃఖము నెవ్వరితోఁ మనవిఁజేసికొందును? మీరే గిన కొలఁదిగడియలకే యనసూయాంది మునికాంతలు మనకుటీ రమునకే తెంచిరి. వారి నెదుర్కొని తోడ్కొనివచ్చి కూర్చుండఁ బెట్టి సంభాషించుచుండ వారందరును నన్ను బానీయం బిమ్మని యడిగి నేనొసంగఁబోవుతరి నన్ను నపత్యగా నెఱింగి వంధ్యవగు నీచేతి పానీయంబుల మేమొల్లమని వెడలిపోయిరి.

మృకం—ఆహా! పురిసినపుంటుపై కారముచల్లినట్లు మరలనిదొక్కటి యా? కట్టా! నాకేటి కీదినమున బ్రహ్మలోకంబున కేగవలయు నను బుద్ధిపుట్టె. విధియొక్కచెయిదము లెంతబలీయములు.

ఉ. ఏటికి సత్యలోకమున ♦ దెంతయుఁ జూడజనించెవాంఛ తా
నేటికి పుత్రపుత్రికల ♦ నియ్యకొనండు పితామహుండు నే
నేటికి వారితోడఁ జన ♦ నెంచితి నాకిది యేటి భ్రాంతి యీ
చేటిటు సంభవించునని ♦ చిత్తమునందుఁ దలంపనైతి హా.

దేవా! సురజ్యేష్ఠా! మాకి ట్ల నపత్యదోషముఁ గల్పింప నేల. భవదీయ ద్వారపాలకముఖంబున నిల్లువరింప నేల. ఎంతచదివిన నేమి ఎంత ఘోర తపంబులఁ జేసిన నేమి? ఒక్కగడియలోఁ బూడిదఁబోసినపన్నీర య్యె. సంతతానందప్రదమై యష్టాంగ యోగులకైన నందరానిదై యనేకబ్రహ్మ ర్షిగణ సేవిత దేవేంద్రాదిసకలగీర్వాణ కిరీటస్థగిత నవరత్న నీరాజిత పాదారవిందుఁడైన పితామహునకు నివాసస్థానమై నయా సత్య

లోకమున కేగు ప్రాప్తిమనకబ్బదుగా. కాంతా! మనయిర్వురిజన్మంబులును నేటికి నిరర్థకములైనవి. తుదకొక్కయతిథిని సత్కరింపఁజాలని యొక యభాగ్యగతికింత యన్నోదకముల నొసంగుటక ర్హతలేని నిర్భాగ్యుఁడనై తిని. ఏటికింక మనతపస్సులు? ఎవ్వరు సంతసింతురు? దరిద్రుడుతలకడుగఁ బోయిన వడగండ్లవాన యనునట్లాయె నాయీయడియాస.

మరు—నాథా! ఏటి కిట్లు వాపోయెదరు?

మ. జపము ల్జేసితి మెంతయేని మహితాం ♦ చద్దివ్యతీర్థంబులన్
దరిపదీర న్బలుమార్లు గ్రుంకులిడి దా ♦ నంబు ల్సదా చేసినా
ముపయోగం బొకయింత కానఁబడదో ♦ హా! నాథ దుర్భాగ్యమే
మొ పరేశుండు కృపారసమ్ము మనపై ♦ పూరింపఁడాయెన్ కటా.

మనదురదృష్టవశంబున మనకాభాగ్య మబ్బదయ్యె. దానికి మనమేమి చేయఁగలము? ఈశ్వరనిర్ణీతమింతయే యని తలంచి తూష్ణీంభావమును వహింపవలయును.

మృకం—సతీ! మన కిప్పుడు తూష్ణీంభావము కాక వేరు కర్తవ్య మేమున్నది.

గీ. ఎంతపుణ్యమొనర్చిన ♦ నంతఫలమె
మనకు లభియింపఁ గలదని ♦ మానసమునఁ
దలఁచి యూరకయుండుటే ♦ తలిరుబోఁడి
మనకుఁ గర్తవ్య మనుకొమ్ము ♦ మందగమన.

మరు—అట్లయిన మన కీజన్మమున సంతానభాగ్య మదృష్టమేనా? మనల నీ పున్నామనరకమునుండి తప్పించు ఘనులే లేరా?

మృకం—సాధ్వీ! ఎంతవెఱ్ఱిదానవు? కొద్దినోములునోచి యెక్కువఫల ముఁ గోరిన లభించునా? మనపూర్వజన్మకృతసుకృత మత్యల్పమని యెఱుంగవా? మనమిర్వురమును మందభాగ్యులమను మాటను మరచితివా?

ప్రథమాంకము.

**మరు**—

కం. ఏపాప మొనర్చితినో
యేపిల్లలజననికిఁ బిత • కెడఁ బాపితినో
యాపాపకర్మ ఫలముల
నీపుడమని యను భవించి • మృతినొందెద నేన్.

అత్యంత ప్రేమాస్పదులైన యే తల్లిబిడ్డలను నిరంతరవిచారసముద్రమున మునంగున ట్లెడబాపి వారి శోకశాపంబులకు గురియైతినోకదా!

మృక—అర్ధాంగీ! విచారింపకుము. ఈ జన్మమున కింతయే యని తలంపుము.

మరు—నాథా! ఏ మంటిరి? ఈజన్మమున కింతేయా? ఈ కష్టమునుండి మనల నెడ్డుతేర్పఁగల మహాను భులే లేరా? ప్రపంచకమునందెం తేసి పాపములకును బ్రాయశ్చిత్తమను నదొక్కటుండునుగదా! ఏ వేల్పైన మనలఁ గావరాడా? ఏల్ల రాశాబద్ధులము కావలయును.

సీ. భక్తజనాభీష్ట • పారిజాతంబగు
మాధవుఁ డే లేడ • మనలఁ గావ
సకలబంధసమూహ • సంహారకుండగు
శంకరుఁ డే లేడ • చక్కఁ జేయ
నమ్మినవారిఁ గ • ర మ్మనురక్తిఁ బో
షించెడుధాతయె • పోవరాదె
పరమభక్తిని దమ్ము • భజియించువారికి
వరమిచ్చు నిఖిలదే • వతలు లేరె
ధరణినిభవంత ఏవన • చ్చరణమనఁగఁ
గరముచేఁబట్టి పాలించు • ఘనులు లేరె.
పరమధర్మము న్పాలించు • వారు లేరె
అక్కటా! తొందు కేచింత • నంద మాకు.

ఎద్దియైన నొక్కవెరవూహింపుఁడు. బుద్ధికి సాధ్యముకాని కార్యములుండవు
మృకం— ఎంతయాలోచించినను నాకేదియు దారిపొడగట్టకున్నది. ఆపద్బాంధవు లెవ్వరైన మనకు దారిఁ జూపించినకలదు. లేకున్న మనగతియింతే.

(తెరలోపల వీణాగానము)

మరు—ప్రాణేశ్వరా! ఎచ్చటనో వీణాగానము వినవచ్చుచున్నయది వింటిరా?

మృకం—(ఆకర్ణించి) వనితా! అయ్యది బ్రహ్మమానసపుత్త్రుఁడును పరమతపోనిష్ఠాగరిష్ఠుఁడు నగు నారదముని హస్తభూషమై ప్రకాశించుచున్న మహతీనాదము. అదిగో ఆ మహాత్ముఁడు కూడ వచ్చుచున్నాఁడు.

[ప్రవేశము నారదుఁడు]

(4 వ అనుబంధము.)

మృకం— } (అంజలిబద్ధులై)
మరు— } నమస్కరింతురు.

మృకం—మహాత్మా!

సీ. తత్కాలమందుఁ బా ♦ తకముల హరియింప
దగుసాధనంబు నీ ♦ దర్శనంబు
ముందుఁగల్గెడి శుభ ♦ ములకు సంపదలకుఁ
దగుసాధనంబు నీ ♦ దర్శనంబు
పూర్వజన్మార్జిత ♦ పుణ్యలేశము నెన్నఁ
దగుసాధనంబు నీ ♦ దర్శనంబు
కష్టసంఘంబులఁ ♦ గడచుట కిలలోన
దగుసాధనంబు నీ ♦ దర్శనంబు

దేహధారికి నీదగు ♦ దివ్యదర్శ
నమున మా దుష్కాలములందు ♦ విమలమైన
శుద్ధతన్ బ్రకటనఁ జేయు ♦ చుండుగాదె
ప్రకటసద్గుణ సాంద్ర నా ♦ రదమునీంద్ర.

(5 వ అనుబంధము)

నార—పూజ్యులగు మునిదంపతులారా! మీకుం గుశలముకద మీ జప తపస్స్వాధ్యాయానుష్ఠాన కర్మాచరణంబున కంతరాయంబులు రావుకదా!

మృకం—బ్రహ్మర్షి చంద్రమా! భవదీయ కృపాకటాక్షవీక్షణ విశేషంబున మాకు సర్వశుభంబులు సేకూరు. మా జపతపంబుల కేమియు నంతరాయములు కలుగవు. తలవని తలంపుగ నేఁడు మాకు మీ దివ్యదర్శనలాభము కలుగుటవలన నిర్ఘాతపాతము వలె సహింపరానిదై యాకస్మికావమానమునకు హేతుభూతమై హృదయశల్యమై వేధించు మహాకష్టంబునుండి వెలికి వచ్చుటకుఁ దగిన యాదరువు దొరకెనని తలంచితిమి. అనిర్వాచ్యమైన యానంద ముప్పతిల్లె.

నార—మృకండమునీంద్రా! అట్టి మహాకష్ట మేమివచ్చినది?

మృకం—త్రికాలవేదివగు నీకెఱుఁగరానిదికలదా! ఊరక నానోటఁ బల్కింపవలయునను తలంపు.

నార—(జ్ఞానదృష్టిఁ జూచి) సత్యలోక వృత్తాంతమునకా నీవింతవంతఁ జెందుట! ఎంత వెఱ్ఱివాఁడవు. అవమానమా! నీకా! జితేంద్రియుఁడవైన మహర్షివయ్యును నీకీదేహాభిమానము వదలినది కాదే.

ఉ. ఎంతటి వెఱ్ఱివాఁడవు ము ♦ నీంద్ర మనంబున జ్ఞానదృష్టిచే
సుంతగ యోజనల్సలిపి ♦ చూడుము నీకెఱుఁగంగరాని దొ
క్కింతయు లేదు ధర్మమది హీ ♦ నపు ప్రాకృతబుద్ధిచేత ని
ట్లింతగఁ జింతనొందగను ♦ నేమికతంబొ వచింపుమా వెసన్.

ఎద్దియైన నొక్కయవస్థాంతరము సంభవించినప్పుడు బుద్ధిచేత దానిం దొలఁగించుకొనవలయును గాని ప్రాకృతజడునిభంగి నీవుకూడ నిట్లు విచారింపనగునా?

మృకం—దేవా! యిది యెఱుఁగని లోపముకాదు. కాలవశమునఁ గల్గిన బుద్ధిమార్పు.

నార—అట్లయినఁ దీనికొక్క యుపాయమును వచించెద నాలింతువా?

మృకం—తపోధనా! హితోక్తులను వచించెదనన్న వినని వెంగలి యుందునా?

నార—ఎఱుఁగుదువు గదా! త్రింశత్కోటిదేవతాస్తూయమానమై యసంఖ్యాకమహర్షి సంసేవితమై పావనమై విశ్వేశ్వరునకావాసము వారణాశీ క్షేత్రమును మీరిర్వురు నచ్చటికేగి యాదేవునిదర్శించి తత్ప్రాంతారణ్యమునఁ దపం బొనర్పుడు. మీ కోరిక సిద్ధింపఁగలదు.

మృకం—దేవీ! వింటివా? లెమ్ము. తపోధనులవాక్యమును బాలింతము.

నార—మునిదంపతులారా! "శుభస్య శీఘ్రం" అనునట్లిదియే ప్రయాణముహూర్తము. కాన భక్తసంత్రాణశీలుఁడైన పరమేశ్వరుని దర్శించి పోవుదము లెండు.

(5 వ అనుబంధము.)

(నిష్క్రమింతురు.)



## తృ తీ య ర ం గ ము.

(అరణ్యము—మృకండ మరుద్వతులు ప్రవేశము)

### 6 వ అనుబంధము.

మృకం—

శా. కాంతా! చూడుము దేవదారు బదరీ ♦ ఖర్జూరహింతాలస
త్సంతానామల కాదివృక్ష సమితిన్ ♦ సౌజన్య సద్విభ్రమా
క్రాంతప్రస్ఫుట దివ్యఖేచరకిలా ♦ రావాన్వి తంబై యదే
సంతోష ప్రదసారసాదిఖగ సం ♦ చారంబుఁగాసారమున్.

ప్రాణేశ్వరీ! ప్రకృతిశిద్ధమై స్వాభావిక దైవసృష్టివిలాసముం జాటు చున్న యీ కాననంబును జూచితివా?

మరు—మనోహరా! మీరన్నది నిక్కము. బుద్ధిసాధ్యంబులైన మానవ కార్యంబులకును బరమేశ్వర కల్పిత పాంచభౌతిక విశ్వవిలాసమునకును హస్తిమశకంబులకున్నంత భేదమున్నది.

సీ. ఋతుభేదముల చేత ♦ సతము కాలమునకు
భిన్నరూపములఁ గ ♦ ల్పించు నెవఁడు
పంచభూత సహాయ ♦ పరమసాధనమునఁ
జిత్రకార్యంబులఁ ♦ జేయు నెవఁడు
మానవాతీతంబు ♦ లైనవిశ్వాదుల
నిరుప మానమున నే ♦ ర్పఱచు నెవఁడు
కర్మాను సారంబు ♦ గా జీవకోటుల
ఫలము లనుభవింపఁ ♦ బంపు నెవఁడు.
ఒకని నేడ్పించి నవ్వించి ♦ యొక దరిద్రు
నమితి ధనవంతునిగఁ జేసి ♦ యమరు నెవ్వఁ

డట్టి సువిలాసు పరమేశు ♦ నమలచరితు
కృత్యములయందు నరకృత్య ♦ మెన్నఁ దగును.

అందుచేతనే నా కీయరణ్యము కడుసంతసము నాపాదించు చున్నది. దీనికేమిగాని యింకనీయవిముక్త వారాణశీ క్షేత్రమెంత దూరమున్నదో.

మృకం—సతీ! ఇంకెంతయో దూరమున్నదను కొంటివా? ఆ వినబడుచున్న దేమియో యెఱుఁగుదువా?

మ. సతతానేకకుకార్యధూమ పటలీ ♦ సంహారము స్సద్విప్రక్రియా
కృతపాపాత్మక దోషకోటి హారము ♦ స్గీర్వాణసందోహపూ
జితపూతాక్షర దేవనాథతటి ♦ నీ క్షేత్రమ్మునం బూత సు
ప్రీత సంభావిత దివ్యశక్తి యుత ♦ మున్ భాగీరథీఘోషమున్.

అదియే విశ్వేశ్వరలింగమునకుఁ బ్రదక్షిణ మొనర్చుచున్నదో యన్నట్లు కాశీపురింజుట్టుముట్టి ప్రవహించుచున్నదే గంగానదీ ఉత్తరవాహిని నమస్కరింపుము.

మను—(చేతులను జోడించి) గంగా! మంగళ తరంగా!

మ. ప్రీతము ల్దేవ గురూత్తమాగ్రజ సుసే ♦ వల్దివ్య దానంబులన్
సతతంబున్ నెఱివేర్చియుర్వి సమగతి ♦ న్సాధింపఁగాలేని సం
తత ముక్తిన్భవదీయ పుణ్యసలిల ♦ స్నానంబున నాంచిరో
నతభక్తాన్వయ పోషిణీ! హితమతీ! ♦ నవ్యాకృతీ! జాహ్నవీ.

మృకం—మాతా! పరివృత సకలసురవ్రాతా!

మ. అమితామోదము నీదు దర్శనము న ♦ వ్యానంద సందాయకం
బు మహీ న్నీజలపానశక్తి సురసం ♦ పూజ్యా సదాపుణ్యలో
కముల నలఁ జేసి పాపములఁ జ ♦ క్కాడు న్భయస్నానముల్
భ్రమలందీర్చి తరింపఁజేయు మిదె న ♦ న్భాగీరథీ మాతరో.

దేవీ! ఇటుచూచితివా? సువర్ణవికారంబులై యంబరచుంబితోపరిభాగ సమన్వితంబులై నిరుపమాన ప్రభాకలిత శోభాయమాన చారుతర శృంగారాతిశయంబులఁ దనరారు సౌధంబులతోఁ జూచువారలకు నేత్రోత్సవము నాపాదింపఁజేయు నీ కాశీపురవైభవ మెట్లున్నదో?

మరు—చూచితిని. అంతకంతకు సమీపమగుచున్న కొలఁదిఁ గడు రమ్యముగఁ గానవచ్చుచున్నది. ఈ పురీనిర్మాణ కర్తలెవరు?

మృకం—ఇది దేవతానిర్మాణముగాని మానవకల్పితము కాదు. దీని ప్రభావము వచింప నలవికానిది.

సీ. త్రైర్థికజనపుణ్య ♦ దాయకంబై పట్టి
పరమసద్గుణ రాసి ♦ వారణాసి
సురగరుడోరగ ♦ పరి కల్పితానేక
బహుచిత్రపురాసి ♦ వారణాసి
ఘనపాప దుర్మాంస ♦ ఖండంబు లాసక్తి
భక్షించు రాకాసి ♦ వారణాసి
బహుళతరానేక ♦ భవబాధ దురిత దు
ష్ప్రాశఖండక రాసి ♦ వారణాసి
పరమ మునిగణ సంతతా ♦ వాసదివ్య
సారతర సురనిమ్నగా ♦ సలిలవాహ
పరమ పూతయశోరాసి ♦ వారణాసి
కనుల పండువుగానదే ♦ కానుపడియె.

ఓనిఖిలసౌఖ్యకరీ! కాశీకానగరీ!

మ. గగనాక్రాంతవిశాలహేమశిఖరా ♦ గారాన్వితంబై దా
జగదానందకరప్రభావయుత స ♦ త్సౌభాగ్యకళ్యాణ దే
వగణానిత యశోభిరామమహిమ ♦ ప్రఖ్యాతమౌ కాశి కా
నగరమ్మా నినుగూర్చి మ్రొక్కెద సదా ♦ నందాబ్ధిఁ దేలింపవే.

మరు— పురదర్శనముచేతనే శరీరమాపాదమస్తకము పులకాంకితమై నిర్వికల్పానందముఁ గలిగించుచున్నది. ఇంకఁ బరమేశ్వరదర్శన మైన పిదప సంకల్పసిద్ధ్యనంతరము మహభాగ్య మనిర్వాచ్యము.

మృకం— అటుచూచితివా?

మ. లలనాప్రాక్తనపుణ్యపుంఘలమున ♦ నాప్రిజ్ల్లు విశ్వేశుదే
వలముంజూడుము బిందుమాధవునిదే ♦ వస్థానము న్గాంచుమా
కలికీ! డుంఠిగణేశు భైరవుని ♦ యాకామ్యార్థసిద్ధిప్రదమున్
నిలయంబు న్గనుగొమ్ము ముంగలనెయో ♦ నీరేజపత్రేక్షణా

మరు— నాథా! అంబర మంటి మండుచున్న యా యగ్నిజ్వాల లెచ్చటివి?

మృకం—అర్థాంగీ అదియేమహాస్మశానవాటిక. దానికిఁ బ్రక్కనే తారకేశ్వరుని దేవాలయముకలదు. ఈమహాక్షేత్రమున మరణించు మానవుల కా మహాదేవుడు తారకమంత్రముపదేశించి ముక్తులఁ జేయుచుండును. దాననే యీస్మశాన మెపతెగక శవదహన సంజనితధూమజ్వాలాసమేతమైయుండుచు. మనమింక జాగుసేయక నీకాశీపురింజేరి యచ్చటిదేవతల సెలవుఁ గైకొని తపం బొనర్పఁ బోదమురమ్ము.

(ఇర్వురు నిష్క్రమింతురు)

---

చతుర్థరంగము.

కైలాసప్రాంతము.

[భృంగీశ్వరుడు చండీశ్వరుడు ప్రవేశింతురు.]

చండీ—భృంగీశ్వరా! ఏమంతశీఘ్రగతి నేగుచుంటివి?

భృంగీ—నందీశ్వరుని కడకేగుచుంటిని.

చండీ—విశేషము లేమి?

భృంగీ—పరమేశ్వరుని యనుజ్ఞయైనది.

చండీ—ఏమని ?

భృంగీ—ప్రయాణమునకై నందీశ్వరుని సిద్ధముగ నుండునట్లు వచింపుమని.

చండీ—శంకరుని ప్రయాణ మెచ్చటికి?

భృంగీ—నీవిప్పు డూడిపడినట్లున్నాడవే! ప్రశ్నముల నధికముగా వేయుచుంటివి.

చండీ—నీవలెనే నేను శివునకు వేడుకచెలికాడనైనచో నిరంతర మాయన సన్నిధినుండి రహస్యములను గ్రహించియుందును నాకట్టియదృష్టమేది? అయినను దీనికింత పూర్వపక్షమేల? ఇష్టమున్న వచింపుము.

భృంగీ—ఇష్టమునకు నయిష్టమునకు మాత్ర మిందేమియును రహస్యములేదే. శంకరుని ప్రయాణపుసంగతి ప్రమదగణముల కందరికిని దెలియఁగా నీకింకను తెలియనేలేదా యని యట్లంటిని.

చండీ—తెలియకపోవుటచేతనే యడుగుట.

భృంగీ—అట్లయిన వినుము. పుత్త్రార్థియై ఘోరతపంబొనర్చుచున్న మృకండమహామునికి వరంబులిచ్చివచ్చుటకై శంకరుడును పార్వతీదేవియుఁ నటకేగ నమకట్టియున్నారు.

చండీ—ఇంతమాత్రమున కీయాకదంపేల? ముందేవచించిన బాగుండెడిది.

భృంగీ—అట్లయిన నీచే యీనిష్ఠురమును బడువారెవ్వరు? ఇంక నన్ను వదలుము. పోవలయును.

(ఇరువురును నిష్క్రమింతురు.)

పంచమరంగము:—అరణ్యము.

[సమాధిలోనున్న మృకండుడు—దేవపూజ జేయుచు మరుద్వతియు నుపవిష్టులై యుందురు.]

మరు—బహువత్సరములైనను మహాదేవునకు మాపై దయరాకున్నది. హా! పశుపతీ! నీభక్తవాత్సల్యమును నెరపుటకింకను తరుణము రాలేదా! అత్యంతభక్తితో సర్వసంగపరిత్యాగులమై యీ కీకారణ్యమున నిన్నే శరణమని మది నెన్నుకొని నిర్మలాంతరంగమున నిడుకొని సర్వదా భజించి స్మరించి తరింపఁగోరుచున్న మాపై నీకేటికో దయరాకున్నది. తండ్రీ! ఇంత విషమపరీక్షయా?

మృకం—(కన్నుల దెరచి) భోసకలలోకసంహారణకారణ! నిరంతర చరణారవింద సేవాపరాయత్త చిత్త వినిర్మలభక్తసంత్రాణ పరాయణ! చిన్ముద్రాంకిత సుజ్ఞాన ధనసంతుష్టిగ సనకసనందనాది మహాముని గణసేవిత సదానందరూపా! పాహిమాం పాహిమాం.

[ఆకసమునుండి నందివాహనారూఢులై శంకర పార్వతులు ప్రత్యక్ష మగుదురు.]

శంక—

ఉ. చాలును చాలు మృకండముని ♦ సంతసమాయెను నీవలెన్ దరన్
మేలగునిష్ఠతో తన ని ♦ మేషులు మెచ్చ తపంబొనర్పఁగా
జాలరికేరు లెవ్వికను ♦ స్వాంతమునందలి వాంఛయేమొకో
చాలవచింపుమయ్య ముని ♦ సత్తమ నీదగుకోర్కె దీర్చెదన్.

మృకం—(చేతులు జోడించి)

(7. వ అనుబంధము.)

దేవా! కృపా పరిపూర్ణ భావా!

సీ. నేఁడుగా నాజన్మ ♦ మిఁకులేని సుయశో
లతి కాస్పదంబయ్యె ♦ లలితదేహ
నేఁడు నా హృదయంబు ♦ నీదర్శనంబున
నిర్మలానందాబ్ధి ♦ నిలిచియుండె
ఇపుడెగా నాజప ♦ తపముల ఫలితంబు
కానరానాయె నో ♦ గరళకంఠ
ఇదియెగా నా పూర్వ ♦ కృతపుణ్యఫలమును
గురుతెఱుంగుటకైన ♦ గొప్పచిన్నె
యజ్ఞకర్తవై భోక్తవై ♦ యఖిలలోక
భారవాహకుండవగుదు ♦ బరగునీకు
వందనము లర్పింతుమో ♦ వందితసుర
మమ్ము దయఁజూడఁగా సను ♦ యుమ్మదేవ.

మఱు —

సీ. ఏసామి నయనాగ్ని ♦ కించు విల్తుఁడు కాలి
పూర్ణాహుతిగఁ జేరఁ ♦ బోయినాఁడొ
ఏదేవు క్రోధాగ్ని ♦ కాదానవాన్వయ
మాహుతియయ్యెనో ♦ యతిశయముగ
నే మహాదేవుని ♦ కెనఁగుభూషణములై
ఫణిరాజవంశంబు ♦ పరమభక్తి
ఏమహాదేవుని ♦ వామభాగంబున
గౌరీమహాదేవి ♦ కూరుచుండు
పులికలాప మేదేవుని ♦ పుట్టమరయ
పునుకమాలిక లేసామి ♦ పూలసరులు

అట్టి యో దేవ శంకర ♦ యమలచరిత
నీకు మ్రొక్కెడి మమ్మేలు ♦ నిటలనయన.

శంక—మృకండా! నీ వాంఛితమేమో తెలుపుము.

మృకం—దేవా! నిఖిల జంగమస్థావర హృదయ వీథులఁజరించు నీకు నావాంఛితమే తెలియకుండెనా? నానోటఁ బల్కింప వలయునను కోర్కె కాఁబోలు. అయిన నిటు వినుము.

గీ. ఘోరపున్నామ నరకమ ♦ న్కాపమునకు
దాఁటు సాధనమై యేరు ♦ తనరుచుండు
రట్టితనయుని దయచేయు ♦ మయ్య దేవ!
అమిత విద్యాసుగుణ యుక్తు ♦ డైనవాని.

శంక—మృకండా! నీకుఁ బుత్త్రసంతతి నొసంగుట కొక్క నియమము కలదు. అదేదియంటేని విద్యావినయ శాంత్యాది సద్గుణ సముచితుండైన షోడశాబ్దప్రాయుని గాని దుష్టుండై దురాచార సంచారియై జనకున కపకీర్తిని దెప్పించు దీర్ఘాయుష్మంతునిగాని యొక్కని గోరుకొనుము.

మృకం—మహాత్మా! పాహియని నీ చరణముల నమ్మిన నాపై నిట్లు దయ వదలు టేటిన్యాయము? కులభూషణుండగు కొమరుఁ డొక్కఁడున్నఁ జాలదే! అట్టివానిని షోడశాబ్ద ప్రాయుని నాకొసంగి పుత్త్రశోకమును సంఘటింప నుంటివా?

శంక—మేమేమి చేయఁగలము? ఎవరికైనను గర్మానుసరణము తప్పదు. దానికి మించి ఫలాఫలముల నొసంగుటకు వీలుండదు. నీ పూర్వకృత పుణ్యమున కిదియే ఫలితము. కాల విలంబన మగుచున్నది. శీఘ్రముగ నీ వాంఛితమును దెల్పుము.

మృకం——మహాదేవా! నాంతి యెట్లైనఁ గానిమ్ము. కులనాశకుఁడగు
కొడుకుని గాంచఁజాల. సుపుత్త్రి నొసంగుము. ఆవల వా
యదృష్ట మెట్లున్న నట్లగును.

శంక——నీ యభీష్టము నెఱవేరును.

మరు——(పార్వతీదేవి పాదములఁబడి.)

(8 వ అనుబంధము.)

తల్లీ! భక్తజన కల్పవల్లీ! నీబిడ్డలమగు మాపై నీవే కరుణ
వదలిన మాకింకేది దిక్కు? భవానీ! కష్టంబు లన్నింటికంటె దుర్భర
మగు పుత్త్రిదుఃఖమును జూడఁజాలను. తనయుఁడు కలుగలేదని చింతిం
చినన్ని దినములు గడువకమునుపే వాని మృత్యువును మేము గాంచు
టయా? తల్లీ! మాకీ ప్రతిబంధకమునకుఁ బ్రతిక్రియ నుపదేశింపక
తప్పదు. నీకార్యారంభమున కాటంకమున్నదా? సంకల్ప వికల్పములచే
లోకముల నాడింప సమర్థురాలవు. మాతా! నీవభయ ప్రదాన మిచ్చు
వరకు నీపాదముల విడువను.

పార్వ——(లేవఁదీసి) బిడ్డా! విధికృతమున కాటంకముండునా? దానికి
నేనేమి మరియొకరేమి వేరుగ నొనర్పఁజాలము. జరుగవలసిన
పనులు కాకమానవు. అయ్యవి నీ కిటింగింపరాదు. నీకు శుభ
మగుం గాక. నీభర్తతో స్వస్థానమున కేగుము.

(ఇరువురు నంతర్ధాన మగుదురు.)

మృకం——దేవీ! మన ప్రాప్తి యింతయే రమ్ము పోవుదము.

(ఇరువురు నిష్క్రమింతురు.)





శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః

# యమగర్వభంగము

అను

# మార్కండేయనాటకము.



## ద్వితీయాంకము.



### ప్రథమరంగము.

[మృకండమహామునియొక్క ఆశ్రమ మధ్యభాగము]

[సుశీల - కాత్యాయని - శీలవతి - అను మునికాంతలు ప్రవేశింతురు]

సుశీ—అక్కా! కాత్యాయనీ! మన మరుద్వతీదేవికి లేకలేక పుట్టినందులకు లక్షణవంతుఁడైన కొమరుఁడు జన్మించినాడు. ఆ యమ్మ నోచిన నోముల ఫలితమెంతగొప్పది?

కాత్యా—నిశ్చయము. పెక్కురీతులఁ గుంది విన్న పుణ్యవ్రతంబుల నెల్ల నాచరించి పలుపాట్లకులోనై యాసాధ్వి నేటికిఁ గృతార్థురాలయ్యెను. శీలవతీ! నీ వాబాలుం జూచితివా?

శీల—లేదమ్మా. నేను మాజన్మస్థలమునుండి మొన్ననేగదా వచ్చితిని.

సుశీ—అదేమి చిత్రమో కాని మన మనేకమంది విప్రబాలకులఁ గాంచుచుంటిమి కాని యిట్టిశిశువును మాత్రము చూడలేదు. బాలకుఁ డెన్నఁడు రోదనమొనర్చి యెఱుంగడట. తండ్రితపంబుఁ జేసి

కొను ప్రదేశమునకరగి తానుకూడ నొకపీఠముపై జపము జేసి కొనువానివలె కూర్చుండునట.

కాత్యా—మరియొక్క సంగతియున్నది. ఆ బాలకుని కరతలంబున ద్రిశూలడమరుకాది చిహ్నములును ఫాలంబున నేత్రాకారముకల రేఖకమచ్చయుండునట.

సుశీ—నేను వానిం జూడలేను కాని వినియుంటిని. మొత్తముమీఁద నా బాలుఁడు వరప్రసాది యనుట నిస్సంశయము. దాననే యా బాలకుఁడు పుట్టినది మొదలు మనపల్లెలోని వారెవ్వరు నతివృష్టియు ననావృష్టియు మొదలైన యీతిబాధల నెఱుంగరు.

శీల—మరుద్వతీదేవి మనల నీదినమున వేగముగ రమ్మని వార్తనంపిన దేమో ?

సుశీ—ఈదినమునఁ గుమారమార్కండేయుని పంచమ సంవత్సర జన్మదిన మహోత్సవ మగుటచే పండువచేసికొని బాలకునకు ముత్తైదువులచే దీవనలిప్పించునట.

కాత్యా—మనల నతివేగముగ రమ్మని వార్తనంపిన యామె తానే యింత యాలస్యము జేయుచున్న దేమో ?

శీల—ఇంట కార్యనిర్వహణ మింకను దీర లేదు కాఁబోలు. అదియునుం గాక మనవిప్రకాంత లాచారశూన్యమునుగాని కార్యము పట్ల బద్ధకమును జూపుటగాని యెఱుంగరుకదా ?

సుశీ—అదిగో మాటలోనే యిటువచ్చుచున్నది.

[ప్రవేశము. మరుద్వతి]

కాత్యా—ఏమమ్మా! మరుద్వతీదేవీ ! లేక లేక ముద్దులకొమరుని సంపాదించి నంతులకుఁ గాబోలు. మమ్ము జక్కఁగా మరచితివి.

మరు—అమ్మలారా! క్షమింపుడు. వదినా కాత్యాయనీ! నీవుకూడ నట్లనిన నేనేమని బదులుపల్కుదును? బాలున కభ్యంగనము జేసివచ్చుటచే యింత యాలస్యమాయె. మన విప్రగృహముల యందుం గార్యములట్లు నొకగడియ కింకొకగడియ యాలస్యమగుట యాచారముకదా?

కాత్యా—లేదమ్మా. నవ్వులకంటినమ్మా

మరు—పుణ్యాంగన లందరును వచ్చియున్నారా?

సుశీ—అందరును వచ్చియున్నారు. మనము కర్తవ్యమునకు గడంగ వచ్చును.

శీల—మరుద్వతీదేవీ! మున్ముందు నీకుమారుని బిడ్డుపుము. చూడ వేడుకయగు చున్నది.

మరు—ఇదిగో పిలుచుచుంటిని.

(9 వ అనుబంధము)

నాయనా! నాతండ్రీ! మార్కండేయ! ఒక్కమారిటురమ్మా

(మార్కండేయులు తల్లిదగ్గరకు వచ్చును)

మరు—(ఎత్తుకొని) బాబూ! రమ్ము. ఈ పీఠమునం గూర్చుండుము. ఏమిచేయుచుంటివి నాయనా?

మార్క—నాన్నగారు నా కుపదేశించిన శివకవచమును బాడుకొనుచుంటిని.

శీల—ఏమి యీబాలుని తేజోవిశాలనై పుణి! దిగంతంబుల వ్యాపించుచున్నది.

మరు—కుమారా! ఈదినమున నీజన్మదినమహోత్సవము. కావున నొక్కమారీ పుణ్యాంగన లందరకును నమస్కరింపుము.

(మునికాంతలకు శుభాక్షతల నిచ్చును)

మార్క—అమ్మా!

గీ. ధన్యుఁడను నేను మాతరో ♦ ధరణిలోనఁ
బుణ్యకాంతల కెల్లను ♦ మ్రొక్కు లిడుటఁ
బూర్వకృత పాపసంఘము ♦ లోప్వె తొలఁగి
నరుల కీపుణ్యకాంతల దరిసెనమున.

(10వ అనుబంధము)

(నమస్కరించును)

సుశీ—నాయనా! మార్కండేయ!

గీ. తారలున్నంత కాలము ♦ ధరణిలోన
సుత! చిరంజీవివై యొప్పు ♦ చుందు వింక
నాయురారోగ్య వంతుండ ♦ వగుచు సకల
సురగణ పరిరక్షితుఁడవై ♦ పరగెద వికఁ.

కాత్యా—

(అక్షతలుంచును)

కం. నీ దైవమైన శివుఁడే
సాదరమతిఁ బరమకరుణ ♦ పాకును నిన్నున్
మోదము ఘటిల్లఁ గావుత
నీదగు జీవితము ధరణి ♦ నిలుచున్ దిరమై.

(అక్షతలుంచును)

శీల—కుమారా! సకలవిద్యా పారంగతుడవై నిరంతర శివపూజా దురంధరుండవై యాయుష్మంతుఁడవై మనుము.

(అక్షతలుంచును.)

మార్కం—సతీమతల్లులారా! మీదీవనలం దలఁదాల్చితిని. అమ్మా! ఁనము నాకేమియానతి?

మరు—కుమారా! సకలవేల్పులును నీకుదోడై వెన్నంటి నీయాయుర్ధనంబును బెంపొందింతురుగాక. నీవు నేఁటినుండియు విద్యా

(అ)భ్యాసకుఁడవు కావలయును. నాయనా విద్యతోసాటియగు వస్తువు వేరులేదు. కావున నీవింకమీఁద శ్రద్ధాసమేతుఁడవై యానందదాయకమైన విద్య నుపాసింపుము.

మార్కం—అట్లేయొనర్చెదను. ముత్తైదువులు (నిష్క్రమింతురు)

(మృకండుఁడు జాబాలితోఁబ్రవేశించును)

మృకం—దేవీ! మనపట్టికి మంగళాశీర్వాదములైనవా?

మరు—నాథా! యాకార్యమిప్పుడే సమాప్తమాయెను.

జాబా—ఆహా! ఈబాలుని కళాపరిపూర్ణవదనమును ముద్దాడ గోర్కెకలుగుచున్నది.

మృకం—తనయా! గురువులకు నమస్కరింపుము.

మార్కం—(నమస్కరించును)

జాబా—నాయనా! సకల కలాకోవిదుఁడవై దీర్ఘాయుష్మంతుఁడవై మనుము. ఈ శుభముహూర్తమున నీకువర్ణోపదేశంబును గావించెదనురమ్ము. (కూర్చుండబెట్టి) వత్సా! ప్రాఙ్ముఖుండవై నామాటలనువినుము. (అక్షరములువ్రాయించి) కుమారా! ఈ విద్యకధిదేవత సరస్వతి. ఆదేవి యనుగ్రహముచేతనే సకల విద్యలువశములగును. ఇప్పుడు నీచే వ్రాయింపఁబడిన వర్ణముల కధిదేవత శంకరుఁడు. ఈవిద్యయను పదార్థమువలన సాధింపరాని కార్యములుండవు. విద్యయనఁగా జ్ఞానమునిచ్చునదని యర్థము. జ్ఞానమనఁగా యేపదార్థముకొఱకై బ్రహ్మాదిదేవతలందరును వెదకి వెదకి వేసారి కాననేరకుండిరో యేవస్తువు నన్వేషింపఁదలంచి మహామునులందరును విశ్వప్రయత్నముల జేయుచుండిరో యట్టి దివ్యపదార్థము సుషుమ్నాంతదృగ్గత్యా వివేకము కంచచక్రాతీత సహస్రారములాంతర్గ్వాసము బ్రహ్మపదార్థమేదికలదో యద్దాని దెలిసికొనుటయే జ్ఞానమని తెలిసి

కొనుము. అట్టి జ్ఞానము నీవిద్యవలన సాధించవలయును. మరియును దీని ప్రభావ మహిజ్ఞానసగోచరము. అక్షరము. ఆశ్వరము. అవ్యయము అకారాది క్షకారాంతవర్ణనిర్మితగ్రంథస్వరూపము. కావున వత్సా! జన్మమాదినంనులకదియే సార్థకత. బుద్ధిమంతుండవై విద్యాసారమును గుర్తెఱుంగుము.

మార్కం—ఆచార్యా! తాము చెప్పినవానిని వినంగ నాకుం గొన్ని సంశయములు కలిగినవి అనుజ్ఞనొసంగిన విన్నవింతును.

జాబా—వత్సా! నీసంశయము నేనెఱుంగుదును. అయ్యదిప్పుడు తీఱునదికాదు. ముందుముందు గ్రంథపఠనానుభవమునఁ దెలిసికొనఁగలవు. మృకండమునీంద్రా! నీతనయుని నావెంటనంపుము. సంపూర్ణ విద్యావంతుఁడు కాఁగలఁడు.

మృకం—మహాత్మా! మహనీయులకు తమపల్కు లూరకఁ బోవునా? ఇదే నాకుమారుని మీకరతలంబునఁ బెట్టితిని.

జాబా—కుమారా! పితరులకు నమస్కరించి నావెంటరమ్ము.

(మార్కండేయులు నమస్కరింతురు)

మృకం—మరు—దీర్ఘాయుష్మాన్ భవ. (జాబాలి మార్కండేయు నితో నిష్క్రమించును.)

(తెరపడును.)

---

ద్వితీయరంగము:—వసిష్ఠుని యాశ్రమభూమి.

[పాడుకొనుచు నారదుఁడు ప్రవేశము.]

(11 వ అనుబంధము.)

నార—తలంచిన సంకల్పముచు గొనసాగించుటయే సజ్జనులపద్ధతి. జనింపఁబోవు వాంఛామహీరుహము కొఱకంకురమును నాటితిని,

అయ్యది మొలకెత్తె. తగినదోహదములచే దానిని వృద్ధికెక్క-
నట్లొనర్పవలయును. పాపమామృకండుడు లేక లేక కలిగిన తన
యుఁ డల్పాయుర్దాయుఁడగుట కెంతయు దురపిల్లుచున్నవాఁడు.
ఆబాలుని మహామునుల దీవనలకుఁ బాత్రునిగావించి శంకర
భక్తుని జేసెదను. అప్పు డీ యముని ప్రభావ మెట్లడుగంటకుం
డునో. కావున నిందుల కాధారభూతులగు మహాత్ముల నొక్కరి
నెన్నుకొనవలయును. అట్టివా రెవ్వరు? (సవితర్కముగ) ఎవ్వ
రోయననేల? కలఁడుగదా మహాతపోమహిమాభిరాముఁడైన
వశిష్ఠమహాముని ఆతని హృదయక్షేత్రమున నాటెదఁగాక.
(ముందుఁజూచి) కార్యవశమున మైమరచి యెంతదూరము
వచ్చితినో తెలిసికొనఁజాలకపోయితిని. ఇదే వశిష్ఠాశ్రమము.

గీ. నిరుపమాకారు శంకరు ♦ చరణకమల
చింతనాయత్తమైనట్టి ♦ చిత్తమెనయ
వచ్చిచేరితి నీమునీ ♦ శ్వర వరేణ్యు
నాశ్రమమునకు సంతసం ♦ బాయె నాకు.

భళిరే! ఈ వశిష్ఠుని తపోఫలసిద్ధి యెంతయొప్పుచున్నది?

సీ. అదెయొకచోట న ♦ త్యంతమైత్రిఁ జెలంగ
భక్షించుచున్న గో ♦ వ్యాఘ్రసమితి
పరమాదరముతోడ ♦ వనమందుఁ జరియించు
వనమయూర భుజంగ ♦ వరయుగంబు
ఒకసరోవరమున ♦ నుదకము ద్రావెడు
పంచాస్య మదగజ ♦ ద్వయగణంబు
హితమతితోనల్ల ♦ మెడలఁ జరించెడి
సారమేయ బిడాల ♦ సంఘము మది

కమిత మోదంబునించు చ ♦ హార్నిశలను
వరమునీంద్రుని శక్తిని ♦ పరువిధముల
వెల్లడించుచు నున్నట్లు ♦ విమలగతిని
వెలయుచున్నది యాశ్రమ ♦ విభవమార.

ఘోరమృగంబులు సైతము శాంతి నవలంబించి యున్నవో యన్నరీతిని మౌనముద్రను దాల్చి యొంతయొప్పుచున్నవి ?

సీ. బాటసారుల కెల్ల ♦ స్వాగతంబులంబల్కు-
చున్నవో యన నొప్పు శుకములజత
విమల మహా సామగా ♦ నము చేయుచున్నట్టి
యకలంక సుస్వర ♦ పిక యుగంబు
కవకవ ధ్వనులతో ♦ నివరిధాన్యములకై
యల్లదే వ్రాలు వి ♦ హంగసమితి
ఆశ్రమాగతుల న ♦ య్యాదె యెదుర్కొన నోచి
లీలతో నరుదెంచు ♦ లేళ్లగుములు.

హవ్యకవ్యాది నిత్యకా ♦ ర్యముల కొఱకు
దివ్యదుగ్ధమ్ము లొసంగెడి ♦ ధేనుసమితి
కన్నుదోయికి సంపూర్ణ ♦ ఘనతఁగలుగఁ
జేయుచున్నది యాశ్రమ ♦ చిత్రమిచట.

ఎంత యోజించినను దపస్సునకుఁ జాలిన ప్రయత్నమును సత్వగుణము నతిక్రమించు గుణమును గానము. అదిగో ! అపరబ్రహ్మయైన వసిష్ఠ మునీంద్రుఁ డీయెడకే వచ్చుచున్నాఁడు.

[వసిష్ఠుని ప్రవేశము.]

వసి—బ్రహ్మ మానసపుత్త్రునకు స్వాగతము.
నార—నమః పరమర్షిభ్యః

వసి—నారదా ! ఎచ్చట నుండి నీరాక ?

నార—మునీంద్రా ! మదీయాశ్రమ ప్రదేశము నుండియే.

వసి—ఎచ్చట కేగుచుంటివి ?

నార—మరెచ్చటికిని లేదు భవద్దర్శనార్థమే.

వసి—నన్నుంగాంచుటకే ! మహాత్ములూరక రారే ?

చ. అమితమహాతపోబలస • మంచిత దివ్యతపఃప్రభావితా
విమల రమేశునామము వి • వేకమతిన్ భజియించు వాఁడవై
ప్రమదముమీఱ నెల్లరసు • భావములోన హితుండవై వెలుంగు
మహితశక్తివంతుఁడవ • నూనకృపాన్వితభక్తిసంయుతా.

అట్టినీరాక యూరకే పోదు.

నార—మరేమియును లేదు. నీవంటి సత్వగుణ ప్రధానుఁడగు మునీంద్రుని దర్శనము సకల పాపక్షయ మగుటఁ జూడ నరుదెంచితిని.

వసి—నారదా ! యీపొగడ్తల కేమిగాని నీవిప్పుడు నీపర్ణశాల నుండియే వచ్చుచుంటివా ?

నార—అరుంధతీ మనోహరా ! దాచనేల. మన హృదయములు మన కేగాని యన్యులకెఱుక పడదు. నేనిప్పుడు బయలుదేరి మృకండ మహాముని యాశ్రమంబున కేగివచ్చుచుంటిని.

వసి—అతనికి శంకరవర ప్రసాదియైన తనయుఁడొకండుండవలయును గదా ?

నార—వసిష్ఠా ! ఆబాలుని బుద్ధివిశేషమునుగూర్చి నే నేమని చెప్పుదును ?

సీ. జతకాండ్రతోఁ గూడి • చదువఁ బోవునుగాని
పరులతోఁ బల్కఁగా • పరువులిడదు

పెద్దలకడఁ జేరి ♦ వినయ మూఁడునుగాని
కటువాక్యములఁ బల్క ♦ గడగబోడు
జవదాఁటియెఱుఁగడా ♦ సద్బాలకుండు తా
గురువచశ్శిష్ఠిసత ధర్మ ♦ సరణి నెపుడు
కలనైనగాని న ♦ వ్వులకైన నెన్నఁడు
బొంకు మాటలఁ బల్క ♦ బోఁడతండు
సతత పరమేశ్వర ధ్యాన సంకలిత మ
నస్కుఁడై యొండువద్మాస ♦ నముస నున్న
పరమ యోగీంద్రుని వలెనె ♦ వరలుచుండు
నేమి చెప్పఁదునయ్యా ము ♦ నీంద్ర నీకు

అట్టి వానిం గన్నవారి కేమతరఁబుల వరకును బుణ్యలోక మబ్బదా?

వసి—నీవనినమాట నిజము. లోకంబున నట్టివారే చిరంజీవులై లోకో ద్ధారకులై ఖ్యాతికెక్కెదరు. మహేశ్వరవరప్రసాద జనితుఁడైన యీకుమారరత్నముయొక్క శక్తియింతింతని వచింప నలవియగునా?

నార—విధితనయా! నాదొక ప్రార్థన కలదు.

వసి—నారదా! ఆజ్ఞాపింపుము.

నార—నీవొక్కమా రాబాలునిగాంచి మనస్ఫూర్తిగ దీవించి రావ లయును.

వసి—తప్పక వచ్చెదను. దానికేమిగాని రాఁబోవు కలియుగోద్ధరణ మునకై నీవు వ్రాయుచున్న స్మృతిని ముగించితివా?

నార—ఇంకను సమాప్తముకా లేదు కాని యిప్పట్ల నే నొనర్చుచున్న కార్యము నాకే తృప్తికరముగాకున్నది.

వసి—అదేల? అంతలో నిరసనభావమును వహించితివి?

నార—కాలానుసారంబుగా వచ్చుదానిని మన పితామహుండైనను త్రిప్పఁజాలడు. కలియుగప్రారంభమైన కొన్నివేల వత్సరంబులు జరిగినపిదప జరుగనున్న సంగతులఁ దలఁచినచో నానిరసనభావ మింకను వృద్ధికెక్కుచున్నది. తలంచినచో నీకును బోధపడును. మరియు నాదినములలో ధర్మదేవత యొంటిపాదమునఁ గుంటుచు నడుచును. ఆచారమంతయు నశించును. ఎవ్వరికి వారే స్వతంత్రులగుదురు. వేదములపౌరుషేయములని వాదించు ఘనులు మెండగుదురు. మరియును,

సీ. వర్ణాశ్రమాచార ♦ పరమధర్మమువీడి
వర్ణసంకరులయి ♦ ప్రబలువారు
స్నానసంధ్యాద్యను ♦ ష్ఠానంబులవదలి
యాచారహీనులై ♦ యమరువారు
మతధర్మములనెల్ల ♦ మంటలోఁ బలఁగల్పి
మద్యమునుంగ్రోల ♦ మరలువారు
అన్యకులస్థుల ♦ నతిభక్తిభజియించి
వేదమతంబుల ♦ వీడువారు
సంఘసంస్కర్తలమనుచు ♦ సాగిసాగి
దివ్యధర్మంబులనుగోత ♦ దింపిదింపి
వర్ణసాంకర్య మెల్లెడఁ ♦ బ్రబలఁజేసి
పిల్లపీగెడి వారలౌగో ♦ విధికుమార.

కలికాలము ననుసరించి రానున్న దురవస్థను మనస్మృతి గ్రంథములు బోగొట్టునా? పోగొట్టలేకపోవుటటుండ మనమింత శ్రమపడి జాతుల యొక్క పరమాభివృద్ధియే మన మందిడికొని వ్రాసిన స్మృతులను కృత్రిమములనియుఁ బతుపాతమునే ప్రధానసూత్రముగ నెన్నుకొని వ్రాసితిమనియుఁ బల్కుచు నిరంతరము మనపైకి దండెత్తనారంభిం

తురు. మనదేశ మత వర్ణాశ్రమాభివృద్ధికర ప్రయత్నములన్నియు వారి భావములకు నాశనహేతువులుగఁ గన్పట్టును. తల్లి చెవులఁ ద్రెంపెడు వారికి పిన్నతల్లిచెవులు బీరపూవులు కావా యనుసామెతగా వేదములనే ధిక్కరించి వానిని కల్పితములని నిరసించి వాని స్వయంభూతత్వము నకు దురపవాదఁ గల్గించు మహానీయులకు మన గ్రంథములయందేమి గౌరవములభించును? ఇట్టి వ్యర్థప్రయత్నము మన కేల?

వసి—నారదా! అటుకాదు. అజ్ఞానులు విన్నను వినకపోయినను చెప్పవలసినవిధి మనయందున్నది నూటి కొక్కఁడైన మనవాక్యముల నార్షేయములని గౌరవింపకపోఁడు. కావున సత్వరముగ నీగ్రంథమును ముగింపుము. అల్లదే సంధ్యాకాలము సమీపించినది. కాలకృత్యములఁ దీర్పఁబోవుదమురమ్ము.

(ఇర్వురును నిష్క్రమింతురు.)

(తెరపడును.)





శ్రీమేధాదక్షిణామూర్తయేనమః

# యమగర్వభంగము

అను

# మార్కండేయనాటకము



## తృతీయాంకము.



### ప్రథమరంగము — పాఠశాల.

[మార్కండేయులును బాలకులును కూర్చుండియుందురు]

(12 వ అనుబంధము)

మార్కం — బాలకులారా! మన గురువులు వచ్చుట కింక నెంతకాలమున్నది?

బాలకు — ఇంకను ఘటికాత్రితయ మాలస్యము కలదు.

మఱియొకఁడు — అంతవరకును మన మేల యూరకుండవలయును? ఒక్క నిముసమైనను పోయినది అనఁగాఁ గడచినకాలము మరల వచ్చునా?

మార్కం — నీవన్నది నిశ్చయము. కాలము నెప్పుడును వ్యర్థముగఁ గడపఁగూడదు. మనకుఁ గల విధి విహితకర్మాచరణముం గూర్చియు నిత్యకర్మానుష్ఠానముం గూర్చియు నొక్కింత యుపన్యసించెదను. సావధానులై యాలింతురా?

బాల — పరమభక్తితో నాలింతుము.

మార్కం— బాలకులారా ! దుర్లభమైన బ్రాహ్మణకులమునఁ బుట్టి యున్న మన కనుదినము చేయఁదగిన విధి యేమనఁగా?

గీ. బ్రాహ్మ సుముహూర్తమున లేచి ♦ పరమభక్తి
శివుని భజియించి పితరుల ♦ శీఘ్రగతిని
బూజలన్ దృప్తిఁ గావించి ♦ పూర్ణమతిని
గాలకృత్యము ల్దీర్పఁగాఁ ♦ గడఁగవలయు

కం. తదనంతరంబు వేగను
సదమలమతి పాఠములను స్మరియించుచుఁ దా
జనువుకొన పాఠశాలకుఁ
గుదిరికి వెలయంగఁ బోవఁ ♦ గూడును శుభముల్.

మరియును మనము పాఠశాలకేగునప్పుడు త్రోవలోనుండెడి బాలురతో జగడమాడక వ్యర్థసభాషణములతో గాలవిలంబన మొనర్పక విద్యాభివృద్ధినిగలుగఁజేయుఁ బరమేశ్వరుని బ్రార్థింపుచు గురువులకన్న ముందువచ్చి గతదినంబున వారొసంగిన పాఠములను వరించుచుఁ గూర్చుండవలయును. దూరంబున నుపాధ్యాయులఁ గాంచి పుస్తకములను మూసి ముకుళితకరాంజలులమై వారు పీఠమునలంకరించిన వెనుక వారి యనుజ్ఞంగైకొని కూర్చుండవలయును మన మింతవరకును జేయ వలసిన దినచర్యయిదియే.

ప్రధ— మార్కండేయా! నీవు పల్కిన వానిలో పూర్వాపరములేవో యిందుఁ గృతార్థులమైనచో మనకు లభించెడి ఫలమేమో తెలిపెదవా ?

మార్కం— బాలకులారా ! మన బ్రాహ్మణులకు ఋణత్రితయము బాధించుచుండును. అవి యేవనగా దేవర్షి పితౄణములనఁ బరగునవి. ఆమూఁడింటిలో పితౄణము కడుగొప్పది. ఎన్నిజన్మము లెత్తినను దానిని దీర్పఁజాలము. మనము నిద్రలేచిన తర్వాత

ముందుగాఁ బరమేశ్వరుని పిమ్మటఁ దత్తుల్యులగు జననీజనకుల కును పాదాభివందన మాచరింపవలయును. ఎన్ని ఋణములనైనఁ దీర్పఁ గలముగాని నవమాసములనుమోసి కష్టపడి మనలఁ గని మనమూత్రపురీషాదుల నత్యంత సహనముతోఁ జేతులారఁ దీసివైచి మనశుభ్రతయే తనశుభ్రతగను మనబాగునే తన బాగుగా నెంచుకొనుచు మనము తృప్తినందుటే తనకు సర్వాభీష్ట దాయకమని తలంచు మాతృఋణముం దీర్ప మనతరంబగునా! ఎన్నియోచాంద్రాయణ వ్రతముల నొనర్చినఫలిత మొక్కమారు భక్తితో మాతృవందన మొనర్చినగలుగునని కదా పెద్దలందురు. అట్టితల్లినిన్నీ ప్రత్యక్షదైవస్వరూపుడై మన కనుల యెదుటఁ బ్రకాశించుచు మనబాగోగుల కొఱకై నిరంతరము చింతించుచున్న మనతండ్రిని సంతసింపఁ జేయుటకన్న వేరానందమేది? దానికన్న మనమున్నత పదవింబొందుటకు వేరాధారమేది? ఇదంతయు యోజించియే మాతృపితృ వందనము ముఖ్యమని విధించి యున్నారు. బాలకులారా! తదనంతరము గురువందన మొనర్ప వలయును. ఏమహాత్ముఁడు మనహృదయగుహాంతరాళ మున సుజ్ఞానదీపమును వెలిగించి యజ్ఞానాంధకారమును నశింపఁ జేసెనో యేకరుణామయుఁడు విద్యయను నక్షీణపదార్థములు మనకొసంగి మనలను ముక్తిమార్గప్రథమ సోపానమున కెక్కించుచున్నాఁడో అట్టియాచార్యుని సేవించుట ముఖ్యకర్తవ్యము. అద్దాన మనకు సర్వకార్యములును ఫలించును. సర్వాభీష్టములును సేకూరును. బాలకులారా! మనపెద్దలు మనకేర్పరచిన పద్ధతులయందెంత గూఢభావముకలదో? ఇంక వారు మన కుపదేశించు విద్యంగూర్చి ప్రసంగింతము. విద్యయనఁగా జ్ఞానమనియర్థము. జ్ఞానమనగా తెలుసుకొనబడునదని యర్థము. అట్టి

జ్ఞానస్వరూపమగు విద్యను పాసించుటయేకర్తవ్యము. వ్యయపరచినకాలంబియుం దరుగనిదియును పరమపావనమై పరమేశ్వర సాక్షాత్కారజ్ఞానపరిపక్వసిద్ధికి మూలస్థానమై నరునకలంకారమై యెసంగు విద్యాధనంబునుసంపాదించుటయే వివేకమనంబడును. ఆవివేకమే బ్రహ్మజ్ఞానసాధనకు మూలస్థానము. బాలకులారా! మన కింతవరకుఁ గర్తవ్యమేమోవచించియుంటిని. గావున దీని తత్త్వార్థమును గుర్తెఱింగి కన్నవారల యశోలతికలకులవిత్రం బులవలెగాక జన్మమును సార్థకమును జేసికొనుడు.

జాబా—(దూరమందుండిచూచుచు) ఆహా! ఏమి యీబాలుని వివేక సంపద! ఎంతయొప్పుచున్నది? ఇంకను ముందేమివచించునో వినవలయును.

మార్కం—బాలకులారా! ఇట్టి దివ్యజ్ఞానప్రాప్తికి మూలసాధనమైన పరమేశ్వరపదార్థము నొక్కింత భజింతము రండు.

(అందరును లేచి చేతులుజోడించుకొని నిలువఁబడుదురు)

(13 అనుబంధము)

[జాబాలి ప్రవేశించికూర్చుండ బాలకులు నమస్కరింతురు]

జాబా—బాలులారా! కూర్చుండుడు. గతదినపాఠములన్నియు వచ్చినవా? స్వరలోప మించుకంతైనఁ గన్పట్టకుండ వేదాధ్యయన మొనర్చుచున్నవారుగదా!

బాల-ఆచార్యా! తా ముపదేశించిన యట్లు పాఠములను వల్లించితిమి.

జాబా—మార్కండేయా! బాలకుల కేమో బోధించుచుంటివే?

మార్కం—గురూత్తమా! మరేమియును లేదు.

జాబా—కుమారా! వెరువకుము. నీ వుపన్యసించు ప్రతివాక్యమును వింటిని. సమస్త శాస్త్రాధ్యయన సంపన్నుండవై తత్సారగ్రహణ దక్షుండవై వివేకశాలివగు నింతయు నాకు కరంబుమోదంబు

జకించె. ఎట్టివారైనను విద్యాసారంబును గ్రహించుటయందు నిన్నుజూచి కదా నేర్చుకొనవలయును.

మార్కం—ఆచార్యవర్యా! తెలిసియో తెలియకయో నేననిన వాక్యములందు దోసములున్న మన్నింపుడు.

జాబా—కుమారా! లోపములేవియును లేవు. నీ వింకను గొన్ని రహస్యాంశములను దెలిసికొనవలయును. వానిని గ్రమముగ బోధించెదను. ఇప్పటి కింటికి బోదము రమ్ము. బాలకులారా! మీరందరును పాఠములను వల్లించుచుండుడు. నే నిప్పుడే మరలివత్తు.

(మార్కండేయునితో నిష్క్రమించును.)



ద్వి తీ య ర ం గ ము.

[మృకండుడు. మరుద్వతియు నాసీనులై యుందురు.]

14 వ అనుబంధము.

మరు—అయ్యో! దుర్భరము. దుర్భరము. ఈభవిష్యత్పుత్రశోకమును జూడఁజాల. నాథా? మీ రేలయిట్టి వరముం గోరితిరి? హా పరమేశ్వరా! ఏటికి నీకృపాకటాక్షమునకుఁ బాత్రులము కాక పోయితిమి? రావే! మ మ్మీ శోకసాగరమునుండి దరిజేర్పవే.

మృక—సాధ్వీ! ఏటికిట్లు శోకించెదవు? చిత్తమునకు ధైర్యమును దెచ్చుకొనుము. నీవిట్లు మాటమాటికిని కడుపుపగులునట్లు వాపోయిన నీకుమారుఁడు దీర్ఘాయుష్మంతుఁడు కాఁగలఁడా? ఏల వెఱ్ఱిని బడియెదవు?

కం. ఎక్కడి తనయులు జగతిని
యొక్కడి జననీ జనకు లిఁ కెక్కడి హితులో

యెక్కడి భవబంధము మన
కిక్కరణి న్జుట్టకర్మ ♦ మేయగుఁ గాదే.

మరు—అయ్యో! నాతనయున కెంతలో జీవితకాలము సమాప్తమగుచు వచ్చె! నిముసములు గడిచినకొలఁదిని వాని మృత్యుదేవతా కరాళవదనము నాకట్టెదుటఁ దాండవ మాడుచున్నట్లున్నది గదా! హా! హా! చూడఁజాల.

మృకం—ఇంక నే నీమె నేమని యోదార్పఁగలను ? ఊరడింపబోయి నేనే దుఃఖాగ్నికిఁ గాల్పడుచుంటిని హా కుమారా?

మ తనయుల్లేరని యెంచి ఘోరమగుకాం ♦ తారంబునందు న్దపం
బొనరం జేసియు మామహేశకృపచే ♦ నుప్పారనిన్గాంచఁగా
జనితంబైన శ్రమంబు వాయదయయో ♦ సౌభాగ్యసంధానస్
యనివార్యంబగు శక్తిఁ జూచుటకు నీ ♦ యాయుర్ధనం బేదొకో.

అక్కటా! కుమారా! అప్పుడే నీకు జీవితకాలమంతయు కానున్నదా? సతీ! నామాట యింతఁ బాటింపుము. నీకుఁ దనయుఁడు కలుగనప్పు డెట్లుంటివో యద్దానిని స్మరణకుఁ దెచ్చుకొనుము.

మరు—నాథా! అప్పు డొక్కటేచింత ఇప్పుడవిచారములన్నియు నన్ను బరివేష్టింపనున్నవిగదా? వీని నెట్లుసైింతును?

మృకం—ఇంక నొక్కవత్సరము జీవితము కలదుగదా? ఏమహాత్ములైన వానిం గావరాకుందురా! రానున్నదానిం దలంచుకొని యిప్పటినుండియుఁ జింతపడుట వెఱ్ఱితనము.

మరు—హా! తనయా!

గీ. కన్న వేల్పులకును మ్రొక్కి ♦ విన్నయట్టి
నోములను నోచి తుదకు నే ♦ నా మహేశు
దయను నినుమారునిగ బ ♦ డయుట తనయ
అయ్యయో యిట్టిపంతకా ♦ హా కుమార.

మృకం—తండ్రి! నిన్నుఁగొనిపోవుట కామృత్యుదేవత కెంతదయరో!

సీ. నడుపలేదింకను ♦ నల్వురానన నీదు
తరుణితో గార్హస్థ్య ♦ ధర్మవితతి
చేయలేదింకను ♦ జేజేలుభూసుర
లర్పింప నీవు మ ♦ హాతపంబు
తీర్పలేదింకను ♦ దేవమౌని పితౄణ
ములను యజ్ఞాది క ♦ ర్మలనొనర్చి
ధరియింపలేదింక ♦ ధరణిలోఁ మహర్షి
వనియెడి బిరుదమ్ము ♦ నవనిలోన
నిరతవిద్యావిశారద ♦ నియతిచేత
నిరుపమానుండవనుచు భూ ♦ సురులవలన
నుతులఁగన్నట్టి నీవు మా ♦ గతులనెల్ల
నాశనముఁజేసిపోయెదో ♦ నవ్యదేహ.

అహా! కాలగతి యెంతవిచిత్రమైనది. కాంతా! ఒక్కసంగతిని వినుము. ముందీయజ్ఞానమును వదలుము. ఇాకను కుమారున కొక వత్సర మాయువుకలదు కదా! సుతులు లేరని దుఃఖించుచున్న మనకాభాగ్యము నొసంగిన దైవ మీ విపత్తునుమాత్రము తప్పింపడా! ఈశ్వరనిర్మాణ మెట్లున్నదో యట్లుకాకతప్పదు. దానిం ద్రిప్ప మనతరంబుకాదు. (ముందుజూచి) అదిగో చిరంజీవి యిటువచ్చుచున్నాఁడు. వానికి మన దీనభావమును గానరానీయవలదు.

మరు—(కన్నులు తుడుచుకొని కూర్చుండును.)

[మార్కండేయులు ప్రవేశము]

14 వ అనుబంధము.

మార్కం—జననీజనకులారా! మీ తనయుఁడు పాదాభివందన మాచరించుచున్నాఁడు.

మృకం—మారు—తనయా! చిరంజీవివగుదువుగాక.

మృకం—నాయనా! ఎచ్చటనుండివచ్చుచుంటివి?

మార్కం—తండ్రీ! పాఠశాలనుండి వచ్చితిని.

మృకం—గురువులవద్ద నీవిద్యాభ్యాసము సమాప్తి యయ్యెనా?

మార్కం—జనకా! విద్యకు సమాప్తి యెచ్చటిది? అపారమై మహా పారావారమువలె దరిగాంచ శక్యముగాకయున్న విద్య కంతము కలదా? ఏదియో యొక యణుమాత్రమును గ్రహించి సర్వజ్ఞుల మని విఱ్ఱవీగి విద్యాసమాప్తియయ్యెనని తలంతురు అదెంత యజ్ఞానము.

సీ. జగమునం దెనలేని ♦ సత్కీర్తినార్జించి
ప్రఖ్యాతిఁ బడయంగ ♦ వలెనటన్న
గ్రంథాంతర రహస్య ♦ గాథావిశేష ప
రిజ్ఞానధనము నా ♦ ర్జింతుమన్న
సతతంబు జపతప ♦ స్స్వాధ్యాయకర్మముల్
హితమతి నాచరింప ♦ నెంతుమన్న
బ్రహ్మపదార్థ ♦ వ్యజ్ఞాన ఫలితంపు
వరశక్తి సాధింప ♦ వలయునన్న
అవ్యయంబయి సురలకు ♦ నందరాని
మోక్షసౌఖ్యంపు సోపాన ♦ ములకుఁ జేర
నర్హత యొసంగునట్టిది ♦ యమలమైన
విద్యయేకాదె పుత్రమిని ♦ విమలచరిత.

ఏదేవతలైనను త్రిమూర్తులు సైతమూ విద్యాపదార్థమునకు వశ్యులై యుందురు. ఎవ్వఁడు పరతత్త్వ పదార్థ విజ్ఞాన వేత్తయై పరమతపో నిష్ఠాగరిష్ఠుఁడై అగ్రికులమునకు . భూషణాయమానుఁడై యొసంగు

మన్నాఁడో యట్టివానిని విద్యాసార సంగ్రహాగ్రహణ దక్షుఁడని పల్కవలయునేకాని తనకు లభించినది లేశమైనను ఘనముగఁ దలంచి సభల యందు మహాత్ములను బండితమ్మన్యులను వెకసక్కెము లాడువారు విద్యావిహీనులగుదురుగాని విశారదులుకారు. తండ్రీ! బాలుండనగు నేనేడ విద్యాపరి సమాప్తిఁ బొందుటేడ?

మృకం.—కుమారా! నీయుపదేశ మతిశ్లాఘ్యము. రసవంతము. పసిపాపడ వెట్టి విన్నాణమును నేర్చితివి?

మరు.—(తనలో) ఏడాదిలో భగ్నమై పోనున్నవానికి విన్నాణముల కేమికొఱఁత.

మార్కం.—అమ్మా! ఏల నీవట్లు ముఖమును వంచుకొని యుంటివి? నీవదనమున విషాదసూచనము లగపడుచున్నవి. కారణమేమి?

మరు.—విషాదమున కేమియు హేతువు లేదు.

మార్కం.—లేకున్న నీముఖ మట్లుండ నేల? నిజమును వచింపుము.

మృకం.—తనయా! నీ కంతపట్టుదల యేల?

మార్కం.—అదేమో వినవలయునని కోరికకలదు. నేను విననఁగల్గు మోసం బెద్ది?

మరు.—కుమారా! పట్టుదలను వహింపకుము. అది నీకు రాఁబోవు కొండొక యనర్థమును సూచించును.

మార్కం.—అయ్యో! వెఱ్ఱితల్లీ! నీ కిదేటిభ్రాంతి?

గీ. మనశరీరంబులే క్షణ ♦ మాత్రములని
సంపదయుభోగసమితి యు ♦ శాశ్వతమని
మృత్యు వెల్లప్డు మనను ♦ మిన్నఁజూచు
ననుచు మనవారు పల్కిరి ♦ గాన వె తల్లి.

(15 వ అనుబంధము)

అదియునుంగాక నిత్యపదార్థ సంపాదనకైన విచారమును వదలి యని త్యపదార్థ వియోగమునకై కుందుట పామరత్వముగదా. ఏ పదార్థము జనించుచున్నదో యయ్యది నశించుట సిద్ధము ఎద్దానికిఁ బుట్టువ లేదో యయ్యది నిత్యము. అట్టి స్థిరపదవిం జేరఁ బ్రయత్నింపవలెను. విశ్వమే విలయము కానుండ దాని నాశ్రయించి పుట్టిన మనమా స్థిరముగనుండు నది. రాఁబోవు దురవస్థకు వగచిన రాకమానునా! గడచిన కాలమే మనదికాని రానుక్షణమైనను మనదికాదు. ఇంతకును బరమేశ్వరాను గ్రహ మొక్కటుండవలయునుగాని దానివలన నిట్టికడగండ్ల నెన్నింటినో దాటవచ్చును.

మృకం—నీచిత్తపారిశుద్ధ మత్యద్భుతము. నీవాక్యములు సత్యములు. కావున ప్రతివాఁడును జన్మసార్థకమునకై యత్నింపవలయును. కాని యెన్ని వాక్యములనైనఁ బలుకవచ్చును. కడుపున మోసి కనిపెంచిన తల్లియొక్క హృదయమున కట్టిధైర్యము కల్గుటరుదు.

మార్కం—మాటల ధోరణిని గప్పిపుచ్చకి మీమనోగత విచారము నకుఁ గారణముఁ దెల్పుము.

మరు—కుమారా! వలదు. ఆ యశ్లీలవాక్యమును నోటనుచ్చరింప రాదు. రానున్నది రాకమానదను నీవన్నమాట సత్యము. దానికై యిప్పుడీచింతయేల?

మార్కం—(తనలో) ఇదెంత దురవగాహ్యమై యున్నది.

మృకం—మహాత్మా! నారదమునీంద్రా! అపత్యలాభమున కాధారము చూపిన వాఁడవు. పుత్త్రశోకాభావమునకు మార్గముఁజూపి పుణ్యముకట్టుకొనుము.

[ప్రవేశము—నారదుఁడు]

(16 వ అనుబంధము)

నార—మునీశ్వరా! మార్గముల నెన్నింటినైనఁ జూపవచ్చునుగాని యదృష్టమున కొకరు కర్తలా!

మృకం—దేవీ! మనభాగ్యమున నారదులవారే విచ్చేసిరి. ఇంక విచార మునుదక్కి యెదురేగి నమస్కరింతము. (ఎదురేగి తోడ్కొని వచ్చి) మహానుభావా! మృకండుఁడు ప్రణమిల్లుచున్నాఁడు.

నార—మునిదంపతులారా! మీకు శుభములగును గాక.

మృకం—నారదా! మా కిది వరమే యగును. నీ యనుగ్రహముండ కొదువలేదు.

నార—మృకండ మునిచంద్రా! నీకును నీ యాశ్రమ వాసులకును గుశలమా?

మృకం—దేవమూనీ!

గీ. హరిపదధ్యాన నిరతుండ ♦ వైన నీదు
పరమ కరుణా విశేషపు ♦ బలిమి వలన
నేటివరకుఁ గుశలము ము ♦ నికుల తిలక
ప్రకట సద్గుణసాంద్ర నా ♦ రదమునీంద్ర.

నార—మృకండా! సత్స్వభావుండవై పరమతపోనిష్ఠాగరిష్ఠుఁడవైన నీ కెల్లప్పుడును శుభములే చేకూరును గాని వేరువిధములగు కీడులు మిమ్మంటవు.

గీ. పరమ తేజో విశేషజా ♦ జ్వల్యమాన
ధూమ పూరిత వీతిహో ♦ త్రునకు నెన్నఁ
డైన చెదలంట వచ్చునే ♦ యమల చరిత
నీకు సర్వశుభంబులె ♦ నిలుచుఁగాక.

మృకం—మహామునీంద్రా ! సత్యసంకల్పులరగు మీ వాగ్విశేషము చేతనైనను మాకు శుభ మబ్బవలయును గదా.

మరు—మహాత్మా! త్రికాలజ్ఞులైన మీకుఁదెలియని విశేష మేమున్నది! సంతాన లాభమునకు మార్గముఁజూపి యనుగ్రహించిన మీకు నే మీ పుత్రశోకాతురులముగాకుండఁజేయుశక్తి చాలకుండెనా! ఋషికులోత్తమా! నీ చరణములఁబడి మ్రొక్కెదము. మమ్మె ట్లైన నీ దుఃఖసముద్రము నుండి దరిఁజేర్పక తప్పదు. (నమస్కరించును.)

నార—సుమంగలీ ! లెమ్ము. ఒకవేళ కాపాడవలయును. నిష్కళంకమైన నీ సతీత్వమును మహాసీయమైన నీ భర్తయొక్క తపశ్శక్తియే మీకు మంగళంబుల నొసంగును. మే మెన్ని వాక్యములఁబల్కినను బరమేశ్వర సంకల్ప మన్యథామైనచోఁ జేయున దేమియును లేదు. యోజింపఁగ నిప్పట్టున నాకొక యుపాయము పొడఁగట్టుచున్నది. అట్లొనర్చిన మీకుఁ గొంత ప్రయోజనకారి కాఁగలదు.

మృకం } అయ్యో ! అదెద్దియో యానతిండు.
మరు }

మార్కం—వీరు వంతనందుటయు నీ నారదుఁడు వీరి నూరడించుటయు జూడ నాకు రానున్న యనర్థమును సూచింపుచున్నట్లున్నది.

నార—

చ. కలడుగదా పితామహుని ♦ గాదిలిపట్టి తపోధనుండు ని
ర్మలతర సత్త్వమూర్తి కడు ♦ మాన్యతఁగన్న వశిష్ఠమౌని మి
మ్ములఁగన వచ్చువాఁడిపుడె ♦ పూర్ణకృపామతి బాలుకాత్పదం
బులఁ బడవేయుమయ్య ముని ♦ పూజ్యుఁడు దీవనలిచ్చు నట్లుగా.

ఇంకఁ గొంతదిగడియలలో నా మహానుభావుఁ డిటకు రాఁగలండు. వచ్చిన వెంటనే నాతిథ్య మొసఁగి కూర్చుండఁబెట్టి యుత్తరక్షణమున మీ తనయు నామహామునిపాదములకు మ్రొక్కునట్లు జేయవలయును. తరువాత పనికి దైవమే కలఁడు.

మృకం—అట్లే యొనర్చెదను.

నార—ఆ మహానుభావుని గాంచిన వెంటనే నీపుత్రుఁడు మాఱాడక పాదాభివందన మాచరింప వలయును. లేకున్న సంకల్పమునకు విఘ్నము వచ్చును.

మృకం—మీ కా సందియ మింతయును వలదు.

నార—అదిగో! ఆ మునిచంద్రుఁ డిటకే వచ్చుచున్నాఁడు. ఎదురుగా బోదము రండు.

[వశిష్ఠుఁడు రాగా ముప్వురు నెదురేగి సాష్టాంగని పత్తురు.]

మృకం—మహానుభావా!

సీ. స్వతపోవిజిత దురా ♦ శా మహామోహారో
పరమ పావనరూప ♦ వందనంబు

మరు—ఆధ్యాత్మికాఖ్య మ ♦ హాజ్ఞాన నిర్జిత
భవ పాశదుర్బంధ ♦ వందనంబు

మృకం—దూరీకృతానేక ♦ ఘోరాఘ సందోహ
వందిత మునిగణ ♦ వందనంబు

మరు—తాపత్రయంబను ♦ దావాగ్ని భంజించు
ధన్య సచ్చారిత్ర ♦ వందనంబు

మృకం—బ్రహ్మతేజో విరాజిత ♦ వందనంబు

మరు—వందితాఖిల సురగణ ♦ వందనంబు

మృకం—బ్రహ్మమానససుత యిదే ♦ వందనంబు
మరు—వరకృపాన్విత మీ కిదే ♦ వందనంబు.

(నమస్కరింతురు)

నార—నమః పరమర్షిభ్యః (నమస్కరించుచు)

వశి—నమో మహద్భ్యః (నమస్కరించును)

మృకం—మహాత్మా! సమస్తపాపక్షయకరమగు నీ దర్శనముచే ధన్యుఁడ నైతిని.

వశి—మృకండా సతీ సుతులతో నీకు క్షేమమే కదా!

మృకం—మీ యనుగ్రహమున నేటివరకును కుశలము.

వశి—నారదా! నీ విటకరుదెంచి యెంతికాల మయ్యెను.

నార—నే నింతకు ముందే వచ్చి యుంటిని.

మృకం—తనయా! ఆ పరబ్రహ్మయైన యీ మునీశ్వరులకు వందనం బొనర్పుము.

మార్కం—(అంజలిబద్ధుఁడై నిలువఁబడి) మహాత్మా! మీదాసాను దాసుఁడై భవదీయ కృపాకటాక్ష వీక్షణ పాత్రుఁడగు మార్కండేయనాముఁడు వందనం బిడుచున్నాఁడు.

వశి—ఆహా! ఈ బాలకుని సౌశీల్యమెంత యొప్పుచున్నది. (ప్రకాశము) వత్సా!

ఉ. శ్రీకరుఁ డాదిదేవుఁడు వి ♦ శేషవిలాస గుణాభిరాముఁ డా
ర్యాకమనీయ చిత్తవిక ♦ చాంబుజబంధరమూర్తి నిత్యశో
భాకరుఁడెల్ల వేళల మ ♦ హాదయతోడుతఁ దానొసంగుతక్
ని కీఁక జీవితంబులను ♦ నిల్వుము ధారుణి దీర్ఘజీవివై.

(నారదుఁడు మందహాస మొనర్చును)

మృకం—(శిరమును వంచుకొనును)

వశి—(తనలో) ఏమి యీచిత్రము నారదుఁడు నవ్వుచున్నాఁడేమి?
(కోపముతో) ఏమి నారదా! నవ్వితివి?

నార—ఏమియును లేదు.

వశి—అకారణ హాస్యమా?

నార—సకారణమే

వశి—అదెట్లు?

మృకం—మహాత్మా! వసిష్ఠమునీంద్రా!

ఉ. మీరు మహాతపోధనులు ♦ మీదగు వాక్యము రిత్తవోవునే
నారమహాయశోబల వి ♦ శారద శారద చంద్రికా సమో
దారకృపాభిరాములరు ♦ ధన్యులు మీదగు పల్కులన్నచో
నూరకవ్యర్థమై చెలఁగు ♦ నో ఫలియించును వెల్లడింపరే.

వశి—మృకండా! నా వాక్యము లసత్యములైన సూర్యచంద్రులు
గతులు తప్పవలదా? మిన్ను మన్ను ఏకము కావలదా?
విలయంబు సంభవింపదా?

మరు—(తనలో) హృదయమా! ధైర్యమును వహింపుము. మునీం
ద్రుఁడు శాంకూరమును నాటుచున్నాఁడు.

మృకం—వశిష్ఠమునిచంద్రా! ఈబాలుని వృత్తాంతము మీ రెఱుంగనిది
కాదు.

వశి—ఏమి యిట్లనుచుంటివి? (దివ్యదృష్టిఁ జూచి రిచ్చవోవును.)

నార—అరుంధతీ మనోవల్లభా! నా నవ్వునకుఁ గారణ మిప్పుడైన
తెలిసినదా?

వశి—ఎంత ప్రమాదము సంభవించెను. దేవ దేవుఁడగు శంకరుఁడు
విధించువాఁడును నేను దానికి వ్యతిరేక మొనర్చువాఁడనా?
నారదా! ఎంతవాఁడవైతివి! ఇందుకా నన్ను రమ్మంటివి.

నార—అయ్యా! నాకేమి తెలియును. నమస్కరించిన వాఁడా బాలుఁడు. దీవించినది నీవు. నడుమ నాదేమున్నది.

వశి—అవును. నీవే మెఱుఁగుదువు? ఎఱుంగ నట్లుండి యందరి నాడింతువు. నారదా! నీశక్తి నిరుపమానము. త్రిమూర్త్యాదిగా సృష్టియందలి ప్రతివ్యక్తియు నీకు లొంగినదే కాని వేరులేదు. తుదకు లోకోపకారముగఁ బరిణమించుటచే నిన్నెవ్వరేమి యుఁ జేయఁ జాలరు. దానికేమిగాని యిప్పుడే యసత్యదోషమెట్లు పోవును? ఇప్పుడు కర్తవ్య మేమి?

మృ—మునిపుంగవులారా! ఎట్లైన నీబాలుని చిరంజీవిగా నొనర్పుఁడు.

నార— వశిష్ఠా! సర్వజ్ఞుఁడవయ్యు నెఱుంగనట్లు నన్నడిగెద వేల! నా నోటఁ బల్కింపవలయునని కాఁబోలు నీయూహ. అట్లయిన నాకుఁ దోఁచిన యుపాయమును వచించెదను. ఆలింపుము.

(అని చెవులో చెప్పును.)

(ప్ర॥) మనయదృష్టమున నాతఁడు గూడ నిందుఁ దగుల్కొనకూడదా?

వశి—భళిరే నారదా! మంచియుక్తిఁ బన్నితివి. అట్లనే యొనర్తము. మృకండా! మేమిప్పుడు బ్రహ్మలోకంబున కేగుచుంటిమి. నీతనయుని మావెంట నంపుము. వానికేమియు భయములేదు.

మృకం—మునీశ్వరులారా! వాఁడెప్పుడును మీవాఁడే. కొనిపొండు.

వశి—మార్కండేయా! జననిజనకుల యనుజ్ఞఁ గైకొనిరమ్ము.

(16వ అనుబంధము)

మార్కం—జనని జనకులారా! నాకనుజ్ఞ నొసంగినఁ బోయివచ్చెదను.

(నమస్కరించును.)

మృకం—నాయనా! పోయిరమ్ము. సకలవేల్పులు నీజీవితములను గాచెదరుగాక.

మరు—బిడ్డా! ఆ పితామహుఁడు నీకనుకూలుఁ డగుఁగాక.

వశి—నారదా! మార్కండేయా రండుపోదము.

(17వ అనుబంధము.) (నిష్క్రమింతురు.)





శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః

# యమగర్వభంగము

అను

# మార్కండేయ నాటకము.

## చతుర్థాంకము.

ప్రథమరంగము.—సత్యలోకము.

[బ్రహ్మ పద్మాసనాసీనుఁడై యుండ వశిష్ట నారదులు మార్కండేయునితోఁ బ్రవేశము]

వశి— }
నార— } జనకా! నమస్కరించెదము.

బ్రహ్మ—కుమారులారా! మనోభీష్టసిద్ధిరస్తు. నారదా! నిరుపమాన తేజోవిరాజమానుఁడైన యీబాలుఁడు మృకండ తనయుఁడు గాదా?

నార—అతఁడే. కుమారా! పితామహునకు వందన మొనర్పుము.

మార్కం—దేవా! సురజ్యేష్ఠా!

దృ. కో—సరసిజాసన సాధు సన్నుత ♦ శారదాహృదయేశ్వరా
నిరుపమాన శుభాకరావర ♦ నీలవర్ణ కుమారకా
సురకిరీట విభూషితామర ♦ శుద్ధపాద యుగాంబుజా
కరుణతోడను గావుమా నను ♦ కంజజాత పితామహా

మహానుభావా! మృకండ తనయుఁడు మార్కండేయ నామకుండు ప్రణమిల్లుచున్నాఁడు. (నమస్కరించును)

బ్రహ్మ—కుమారా! దీర్ఘాయుష్మాన్ భవ. (అని వెంటనే నాలుక కరచుకొని రిచ్చవోవును.)

వశి—జనకా! తనయులమైన మాపై మీకుఁగలయభిమానమో లేక యీబాలునిపై మీకున్న దయయో మీచే యిట్లు పల్కించి నది. ఏమైననేమి! మాబలువు తగ్గదని సంతసించుచుంటిమి.

బ్రహ్మ—నేఁడు నా కింత బుద్ధిప్రమాదము కలిగినదేమి? ఆహా కాల గతి ఇందులకుఁ గారణమేమి? (జ్ఞానదృష్టిఁజూచి) ఓహో! నారదా! ఇదంతయు నీనాటకమా! ఏమి యింత విపరీతము కల్గు నట్లు చేయించుచుంటివి? మమ్ము మృషావాదులంజేసి లోకము లకుఁగీడొనర్ప సంకల్పించితివా యేమి? ప్రస్తుత మన్నింటిని వదలి మార్కండేయనాటకము నాడించుచుంటివా?

నార—తండ్రీ! మీమాట లసత్యము లెట్లగును. అజ్ఞాతుఁడై స్పృశిం చినను వహ్ని కాల్పకమాననట్లు ఆకస్మికముగవచ్చినను భవిత వ్యమే మీచే యిట్లు పల్కించినది. మరియును,

గీ. తమముఖంబున • వెలువడు ♦ విమలవాక్కు
లెటులమృషయగునయ్య నిం ♦ కటులసత్య
హీనమైనచో లోకంబు ♦ లెటుల నిలుచు
వేదములు నాల్గు మృషయౌవె ♦ విష్ణుతనయ.

కావున యనుగ్రహించి యీబాలునికా పాడవలయును.

బ్రహ్మ—సరియే. రోటం దలపెట్టి రోకటిపోటునకు వెరచినఁగార్య ముండునా? నే నిప్పుడే కైలాసమునకేగి పరమేశ్వరుని ప్రార్థించి యాతని యొప్పుకోలుబడయుటకుఁ బ్రయత్నించెదను. నారదా? నీవీబాలుని గౌతమీనదీతీరంబునఁగూర్చుండఁబెట్టి యొకరహస్య

ప్రదేశమున నితనికిఁ బరమేశ్వరస్వరూపమును బోధపరచి తత్పూజావిధానముఁ దెలియఁ జేయుము.

(తెరపడును.)



ద్వితీయరంగము-పర్ణశాల.

[నారదుఁడు మార్కండేయులు కూర్చుండియుందురు.]

నార—కుమారా! వింటివా శివస్వరూపవిలాసము.

మ. ఘనపాపాటవి వీతిహోత్రుఁడు జగ ♦ త్కళ్యాణసంధాయకుం
డిన తారాపతివహ్ని నేత్రుఁడు జగ ♦ న్మిత్రుండు శంభుండు సం
హననోద్యోగుఁడు సత్కటాక్ష పరిత్రో ♦ షానేకభక్తుండు తా
నినుగావంగలవాఁడటం చెఱుఁగమా ♦ నిక్కంబు లీవాక్యముల్.

సర్వరక్షకుండును ప్రణతార్తిహరుండును శుభంకరుఁడు నగు శంకరుని సర్వకాల సర్వావస్థలయందును చిత్తకమలముననిల్పి సేవింపవలయును. ఈశివశబ్దార్థమును గుర్తెఱుంగ నెంతంతవారికిని యగోచరము. శాశ్వతుఁడగుటచేతను బరమానందవశుఁడై అహంకారాదుల నశింపఁజేసిన నిర్వికారుండగు చిదానందాభాసుఁడగుట నతఁడు శివుఁడనంబడును. అతని సామర్థ్యమును శక్తిని దెలిసికొనఁదలంచి బ్రహ్మేంద్రాదిదేవతాశ్రేష్ఠులు పెక్కువిధములఁ బ్రయత్నించియు వ్యర్థులైరి. ఇతఁడు లయకర్తయైనను విశ్వవ్యవహారమునకే గాని నిజమున కతఁడు జితక్రోధుడనియు శుద్ధసత్వగుణమూర్తియనియు గ్రహింపుము.

మార్కం—మహాత్మా! అట్లయిన నీదేవుఁడు రుద్రుఁడనియు భీముఁడనియు భయంకరనామముల నేలధరింపవలయును? లయమే తనకర్మమనియేల నిర్ధారణఁ జేసికొనవలయును?

నార—కుమారా! నీప్రశ్నము కడుసూక్ష్మము. దానికి సదుత్తరమును వినుము. ఈశ్వరస్వరూప మొకటైనను ప్రపంచకనిర్మాణపాలక

సంహారణాది కార్యానంద విలాసానుభవముకొఱకు మూర్తి త్రయమై వ్యవహరింపఁబడును. అందు శంకర స్వరూపము లయకార్యమునకే వినియోగపడును. ఇతని లయమున నేగాని తక్కిన వారి కృత్యంబుల కాధారము కానరాదు. కావున నాతని కృత్యంబుల ననుసరించియతని కానామము పఁబడినది. మార్కండేయా పరమేశ్వరుండు లోకంబుకొఱకు లయకర్మము నొనర్ప కంకణముఁ గట్టుకొనెను గాని స్వభావముచేత నతఁడు శాంతస్వరూపుఁడు. నిశ్చయముగ రాగియన్నను విరాగియన్నను యోగియన్నను భోగియన్నను నతనికే చెల్లును. సుఖమునిచ్చువాడు గనుక శంకరుఁడనియు శాశ్వతుఁడుగాన శివుఁడనియు లోకముల కెల్ల ప్రభువగుటచే యీశ్వరుఁడనియు బిలువఁబడుచున్నాఁడు. ఈ పరమేశ్వర పంచాక్షరీ మహామంత్రాక్షరములకుఁ బ్రతిదానికిని గొప్పమహాత్మ్యములు కలవు. కావున భక్తిశ్రద్ధాసమేతుండవై శంకరునిగూర్చి తపమ్మొనర్పుము. నీజపసమయమున దేవతాకోట్లతో సురరాజువచ్చినను భటవర్గంబులతోఁ బరేత నాయకుండరుగుదెంచినను నీతావునుండి కదలకుము. నీయిష్ట దైవమగు శంకరుఁడే నిన్ను రక్షించును. ఎవ్వరెన్ని విధంబుల భయపెట్టినను వెఱపుఁ జెందక మనోమందసంబున శంకరాకార నామ విభవమును దాఁచుకొనుము. ఉషఃకాలమున లేచి కాల కృత్యంబులఁ దీర్చి శీతలోదకస్నాతుండవై ధౌతవస్త్రధారణముం జేసి షోడశోపచారంబుల నా మహాలింగమును బూజింపుము.

మార్కం—నారదా! ఇప్పుడుగదా ధన్యుఁడనైతిని. నేడుగదా నాజన్మ తరింపనుండెను. ఎన్నటికిని నీవాక్యములను మరువను

నార—పవిత్రమైన బ్రహ్మహత్యాది పాతకసంహారిణియైన గోదావరీ

స్రవంతీ తీరమున నొకప్రదేశముంజూపెద. అందు దపంబుఁ జేయుము రమ్ము పోవుదము.

(18 అనుబంధము.)

(ఇర్వురు నిష్క్రమింతురు.)

(తెరపడును.)

## తృతీయరంగము.

### యముని కొలువుకూటము.

[యముఁడు-చిత్రగుప్తుఁడును గూర్చుండి యుందురు.]

యము—చిత్రగుప్తా! నే డేయేజీవులను గొనిరావలయునో సమయ మెఱింగి యందులకుఁగా మనభటులనంపియుంటివా?

చిత్ర—దేవా! ధర్మరాజా! యిదే మనభటులు పాపులజీవములను గొని తెచ్చి వానికిఁ గారణశరీరములఁగల్పించి మన హాజారము కడ నిలువఁబెట్టియున్నారు.

యము—ఒక్కొక్కరిని నాయెకుటకుఁ గొనిరమ్మనిపల్కుము.

చిత్ర—చిత్తము. ఓభటులారా? ఆ పాపులనిటకుఁ గొనిరండు.

(భటుడు ఒకపాపిని ప్రవేశ పెట్టును.)

యము—చిత్రగుప్తా! యితఁడే పాపము నొనర్చినాఁడు?

చిత్ర—ఇతఁడు బ్రాహ్మణుఁడైయుండియు నగ్నిసాక్షిగఁ జేకొన్న భార్యను వదలి పరకాంతామానభంగకరుఁడై మహాపాపములఁజేసి యున్నవాఁడు.

యము—ఓరీ! నీచా!

చ. జగతిని విప్రవంశమున ♦ జన్మమునందియు సాధుపద్ధతిన్
అగణితసత్య ధర్మముల ♦ నన్నిటి నిట్లు త్యజించిపాపివై

మగువల జాలముంపుఁ బడి ♦ మానక దుష్ట పథానువర్తివై
తగఁజయించితీ వికను ♦ దండనఁ బొందుట కే పమాఖలా.

ఓభటులారా! యీ దుష్టుని కుంభీపాకనరకంబునఁ బడవేయుడు.

(భటులు వానింగొనిపోయి మరియొకనిని గొనివత్తురు)

చిత్ర—ధర్మరాజా! వీఁడు శూద్రుఁడయ్యును బ్రాహ్మణులను దిరస్కరించి వేదపఠనముఁ జేసి యజ్ఞోపవీత ధారణమునొనర్చి తానే సర్వజ్ఞుఁడనని విఱ్ఱవీగినఁవాఁడు.

యమ—ఓరీ!

గీ. కండ కావరమునధన ♦ గర్వమునను
విఱ్ఱవీగుచు వెకలివై ♦ విప్రసమితి
నెల్ల నిందించి వేదంబు ♦ లెల్ల మైల
పడఁగఁజేసినావే యోరి ♦ పాపచరిత.

వేదోచ్చారణముం జేసి బ్రహ్మసూత్రానర్హుండవయ్యు యజ్ఞోపవీత ధారణముంజేసితివిగా! ఓభటులారా! వీనింగొనిపోయి రౌరవంబునఁ బడవేయుఁడు.

(వానిం గొని పోయి మరియొకనిం గొనివత్తురు)

చిత్ర—వీఁడు వైశ్యుఁడు. అన్యాయ వర్తకంబున విశేషధనమునార్జించినవాఁడు. వీనికి ధర్మచింత లవమాత్రమైనను లేదు.

యము—ఓరీ! వైశ్యవంశబడబానలా! బ్రదికినన్ని దినములును కూడ మూటకట్టుకొని రాఁదలఁచియే ధనము నార్జించితివి. ఏమాత్రము కొనివచ్చితివి? సేవకులారా! వీనిం గొనిపోయి యగ్నిస్తంభమున కంటకట్టుఁడు.

(వానింగొనిపోయి మరి యిర్వురం గొనివత్తురు)

చిత్ర—వీఁడు రాజసభలయందుఁ బెక్కుమారుల సత్యపు సాక్ష్యముల నిచ్చినవాఁడు. వీఁడు న్యాయ విహీనపు పత్రికలను సృజించి యనేక దీనుల కొంపలఁ గూల్చినవాఁడు.

యము—సేవకులారా! వీ రిర్వురిం గొనిపోయి దివారాత్రములనక కశాఘాతముల వాయఁ గొట్టుఁడు.

(భటులు కొనిపోవుదురు.)

యము—చిత్రగుప్తా!

మ. యముఁ డొక్కండు గలండు పాపులను వాఁ డత్యంత క్రోధంబు మీ
రమనఃస్ఫూర్తిగ శిక్షఁ జేయునను వా క్ప్రాబల్య మాలించియున్
రమణీగేహసుతాదులం గని జను ల్లోభాంధులై ఘోర పా
పములం జేయుచు నున్నవారు మదిస ద్భావంబుల న్వీడుచున్.

ఇంతింత శిక్షలొనర్చుచున్నను మితిమీరి మోసాకరులగుచున్నారే! మరచితిని. చిత్రగుప్తా! నేఁడు మనలోకమునకు రావలసిన పుణ్యజీవి యెవఁడు?

చిత్ర—మృకండ మహాముని తనయుఁడగు మార్కండేయుని కాలమాసన్న మగుటచే నతని జీవితముఁ గొనిరా భటులనంపితిని.

[ప్రతీహారి ప్రవేశము.]

ప్రతీ—దేవా! నారదులవారు వచ్చియున్నారు.

యము—ప్రవేశపెట్టుము.

[ప్రతీహారిని నిష్క్రమింప నారదుని ప్రవేశము]

యము—నారదమునీంద్రా! వందనము.

నార—శమనా! కళ్యాణమస్తు.

యము—నారదా! ఎద్దియో కారణాంతరమున వచ్చినట్లు నీ ముఖభావము చాటుచున్నది. అట్టిదేమైనఁ గలదా?

నార—మరేమియును లేదు.

యము—నారదా! అటుకాదు.

గీ. అవని ముల్లోకసంచారి ♦ వగుట నీదు
రాకయనఁగను దీర్ఘకా ♦ ర్యం బదేమొ
పూనియున్నట్లు తోఁచె నా ♦ బుద్ధి కిపుడు
నిజమొ కల్లయొ తెలియంగ ♦ నేరనైతి.

నార—ధర్మరాజా! మార్గానుసారముగ నీలోకము నొకమారు చూచిపోదమని తలంచి యిటు వచ్చితిని. మీ కెల్లరకును క్షేమమా?

యము—నీ దయకల్మిని సర్వమును కుశలము.

నార—శమనా! నీలోకమున కిప్పుడు రానున్న పుణ్యజీవు లెవరైన గలరా?

యము—బ్రహ్మర్షీ! కించిత్కాల మోహికను వహించిన నొక మునికుమారుని గొనిరాగలరు.

నార—ఎవ్వరా మునికుమారుఁడు?

యము—మృకండ తనయుఁడగు మార్కండేయ నామకుఁడు.

నార—ఓహోహో! ఎంతగొప్ప సంగతి? (నవ్వును.)

యము—ఏమి నారదా! పరిహాసమును జేసితివి?

నార—ఏమియును లేదు. పట్టితెచ్చుటకు నీ భటుల నంపితివా?

యము—పంపియుంటిని.

నార—పట్టితెమ్మనియేనా?

యము—పట్టితెమ్మనియె పంపితిని. ఏమి నారదా? ఇట్టి వికటప్రశ్నముల నడిగెదవు?

నార—నాప్రశ్నములు వికటములా? లేక నీప్రయత్నములు వికటములా?

యము—నాప్రియప్రశ్నములు వికటములా! ఏమి యిట్లుమాట్లాడెదవు?
నార—నీ ప్రియప్రశ్నము గాకున్న నీ బుద్ధి వికటమైనదని చెప్పవలయును!
యము—అదెట్లు ?
నార—లేకున్న మార్కండేయుని జీవములం దోడ్తెచ్చుటకు నీభటుల నంపుదువా ?
యము—కాలము తీరినవానిని దోడ్తెమ్మనుటలో లోప మే మున్నది ?
నార—ఆ బాలుని నీలోకమునకుఁ దెప్పింపఁ గలవనియేనా నీయభిప్రాయము ?
యము—ఏమి నారదా ! ఇట్టి జేలతనపు మాటలాడెదవు.
నార—శమనా ! యింక నీ వాక్శూరతఁ గట్టి వేయుము.

చ. వినుమొక నాడు నాకడ గ ♦ భీరతతో విభుమయ్యు యీజగం
బున సుకృతాత్ములన్ దురిత ♦ మూర్తుల నెన్నఁగ నావశంబట
చును మఱి వారికిన్ గతులు ♦ జూపుట నావగుకార్యముచు నీ
వనవినలేదె నేను నిజ ♦ మాడిన నిష్ఠురవాగ్ గదా యమా.

మఱియు నెంత మహనీయుఁడైనను మరణకాలము సమీపింపఁగనే నా కడకు రావలసినదే యని నీవొకప్పుడు నాతో నని యుండలేదా ?
యము—నిజమే అని యుంటిని. అది యిప్పుడేల ?
నార—ఇప్పుడు నీమాటను నీవు నిలుపుకొను తరుణము వచ్చినది.
యము—నామాటను నే నెప్పుడునిలుపుకొనలేదా ?
నార—మార్కండేయుని బట్టి తెచ్చినప్పుడు గదా ! నీమాటను నీవు నిలుపు కొనుట.
యము—అప్పుడే నాభటుల నంపియుంటిని
నార—ఆ బాలకుఁ డెట్టివాడో తెలియునా ?
యము—అతంమాత్రమే నెఱుంగకపోలేదు. శంకరవరమున షోడశా

ర్ధపాపియుఁడై జన్మించినాఁడు. వాఁడెట్టి వాఁడైననేమి వాని కాయువు మూఁడె. నా లోక మతనికిఁగూడె.

నార—నీ మనమున నట్లనుకొని సంతసించుచుందువు. ఆవల జరుగవల సిన కార్యములు జరుగుచుండును. నీ వెన్ని బింకములను బల్కి నను వానినిమాత్రము నీకడకుఁ దేఁజాలవు.

(18 వ అనుబంధము)

యము—ఒక బాలుఁడు నాయాజ్ఞకుఁ దిరస్కరించువాఁడా! నారదా! నన్ను వెకసక్కెమాడఁదలంచితివా! లేక నీకేమైనఁ జిత్తచం చలనముకలిగెనా?

నార—నాకుఁ జిత్తచంచలనము లేదు. కాని నీకుఁ జైత్యచలనమక్కు వాయెను. నేను మునుపటనే పల్కియుంటిని గదా నిజమాడిన నిష్ఠురమని.

యము—శంకరుఁడా బాలునకుఁ బదునారేండ్ల పాయమని నియ మించియుండ నిట్లనెదవేల?

నార—అది నిజమే. కాని ప్రస్తుతము జరుగుచున్న సంగతులు నీ వెఱుంగవు కాబోలు.

యము—అదేమి?

నార—కొంతమంది మునులును పితామహుండునుగలసి యాబాలుని మృత్యువిహీనునిగా జేయఁ దలంచుచున్నారు.

యము—ఎట్లెట్లూ! మార్కండేయున కాయుర్వృద్ధిఁ జేయఁదలంచు చున్నారా? అంతప్రయత్నమైన వీరికేల?

నార—సరియే. దిరిగి యాగాథయంతయుఁ దెల్పుటకుఁ జాలతడవు ప ట్టును. సూక్ష్మముగఁ దెల్పెదను. వాని జననీజనకు లాబాలుని వసిష్ఠునిపాదములపైనను బ్రహ్మదేవునిపాదములపైనను బడవే యఁ గాలానుసారముగా వారికిర్వురకును దీర్ఘాయుష్మాన్భవ

అను దీవనయేవచ్చె. అందుచే వారిమాటను వారునిలుపుకొను టకుఁ గొండంతప్రయత్నముఁ జేయుచున్నారు. ఇంక నీమాట దబ్బరయే. నీయత్నము దుర్యత్నమే.

యమ—నారదా ! నామాటదబ్బరయగునా ? అట్లెన్నటికిని దలంపవలదు. శంకరునియాజ్ఞఁ ద్రిప్పుటకు నీ విధివశమా మతిమాలిన వశిష్ఠునితరమా. ఇట్టిది జరుగునని నీవెట్లునమ్మితివి? అప్పుడే వానిప్రాణవాయువుల నాభటులు కొంతదూరము కొనియే వత్తురు.

నార—శమనా ! ఏటి కీమాటలు.

గీ. ఏటి కీ గతిఁబల్కెదో ♦ యి నకుమార
నాగ్విజృంభణం బీఁకజాలు ♦ వలదుడుగుము
వానిఁగొని తేర నీదగు ♦ భటులవలన
కాదు సరికదా నీచేత ♦ కాదు వినుము.

యమ—నారదా ! ఇంక నీమతిమాలిన మాటను వినువుము.

సీ. ఎఱుఁగవే లోకైక ♦ దురిత క్రియాలోల
సంఘ భీకరచండ ♦ శాసనుఁడని
ఎఱుఁగవే దుర్మార్గ ♦ చరదుష్ట సంఘసం
హారణార్థజనిత ఘో ♦ రాకృతినని
ఎఱుఁగవే నను దుర్ని ♦ రీక్ష్య ప్రతాపాగ్ని
యుత భీకర లయార్క ♦ సుతుఁడ ననుచు
ఎఱుఁగవే సజ్జన ♦ పరిరక్షణాఖిల
దుష్ట శిక్షణ క్రియా ♦ తుండ ననుచు
భువనజాలంబు నెల్లను ♦ పూర్ణమైన
శాసనంబున లోఁజేసి ♦ సకలధర్మ

రక్షణార్థమై యున్న నా ♦ ప్రబలమైన
యాజ్ఞ కెవరున్నయడె చూడ ♦ వా ధరిత్రి.

నార—చూడక పోదునా ! ఈ కన్నుల కీ రెప్పలు దూరములు కావు.

[ప్రవేశము భటులు]

యము—ఓ సేవకులారా! మార్కండేయుని ప్రాణవాయువులఁ గొని తెచ్చితిరా ?

భటు—దేవా! మే మాతనిం జేరుటకైన శక్తులము కాక పోయితిమి ? కూర్చుని రుద్రునిఁ బూజించు చున్నాఁడు. ఎన్నిమార్లు పిలిచితిమి. కన్నువిప్పడాయె. రాడాయె. చేరఁబోవ శరీరమునకు మంటలుపుట్టనారంభించె. ఇంక నీ కార్యమునకు దేవరయే సమర్థులు.

నార—(నవ్వుచు) ధర్మరాజా ! పరేతరాజా ! వింటివా నీభటుల వాక్యము.

యము—ఓ పిరికి పందలారా! సిగ్గుమాలి మీముఖములను మాకేటికి జూపింప వచ్చితిరి ?

గీ. సిగ్గుకింతైన లేదె యో ♦ చెనటులార
బాలునొక్కని గొనిరాని ♦ పందలగుచు
బ్రదికి యున్నారు జీవచ్ఛ ♦ వంబులగుచుఁ
దొలఁగి పొండిక నిటనుండి ♦ తులువలార.

(భటులు నిష్క్రమింతురు.)

నార—అకారణముగా వారిపైన నేటికిఁగోపించెదవు ? వారిచేతఁగాకున్న నీ చేతనగుననియా నీ తలంపు ! నామాటను విని నిపూనికను వదులుము. నీవలనఁ గానేరదు.

యము—చాలు చాలు నారదా ! నీ యసమంజస వాక్సరణి నింకఁ గట్టిపెట్టుము, నీవు బ్రహ్మర్షి వగుటచే నాయెదుట నిల్లనఁగల్గి

తివి కాని మరియొక్కరైన నేమన్యొడిదో ? ఇప్పుడేపోయి యాబాలకుని ప్రాణానిలంబును మదీయ పాశములఁగట్టి నీలోకమునకుఁ దెచ్చి చూపకున్న నన్నీపేరున బిలువకుము.

(19 వ అనుబంధము.)

నార—నారదా! ఇప్పుడుగదా నీవు సంతసింపవలసిన తరుణము. ఈ యమునకు బాగుగా పుగియెక్కినది. ఇక్కడికి మూపువంతులు నాకార్యము గట్టెక్కినట్లే. ఇంక నొకరంగముతో మార్కండేయ నాటకము మృత్యుంజయ విలాసము యమగర్వభంగము పూర్తి యగును. నే నిక్కడ నుండి బయలువెడలి తరుణము రాగనే మృకండ మరుద్వతులతో మార్కండేయుని కడ కేగెదగాక.

(20 వ అనుబంధము.)

(నిష్క్రమించును.)

(తెర వాలును.)





శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః

# యమగర్వభంగము

అను

# మార్కండేయనాటకము.



## పంచమాంకము.



[రంగము. గౌతమీతీరము. సైకతలింగము. పూజాద్రవ్యములతో మార్కండేయులు కూర్చుండి పూజించు చుండును.]

మార్క॥—

(20 వ అనుబంధము.)

హే సకల లోకానంద ప్రదాయక ! దివ్యమంగళ కరపాదారవింద ! హే గిరిజామనోనాయక ! పాహిమాం. పాహిమాం.

సీ. సకల లోకావళి ♦ సంహార కారణ
పావనాకార తు ♦ భ్యం నమోస్తు
పరిపాలి తాఖిల ♦ భక్తలోక బిడౌజ
వందితాకార తు ♦ భ్యం నమోస్తు
జ్ఞానాంక తోషిత ♦ సనక సనందన
వరమునిచంద్ర తు ♦ భ్యం నమోస్తు
బ్రహ్మాది సురవంద్య ♦ పార్వతీ వసిత స
ద్వామాంక భాగ తు ♦ భ్యం నమోస్తు.

ప్రమథగణ పరిసేవిత విమల చిత్త
వరమునీంద్ర మానసపద్మ ♦ పరమ భృంగ
రజతశైల నివాస వి ♦ రాజితాంగ
వందితాఖిల లోక తు ♦ భ్యం నమోస్తు.

(కనులుమూసికొని జపించుచుండును.)

[ప్రవేశము యముడు]

(21 వ అనుబంధము)

యము—ఇదియేగదా ! ఆ విప్రకుమారుఁ డుండెడి తలము. ఇప్పుడు వీఁడెట్లు నాస్వాధీనుఁడుకాఁడో పరిశీలించెద. (సమీపించి) ఆహా! యేమి యీబాలుని సుందరాకారము? ఆకృతి ధరించివచ్చిన బ్రహ్మతేజమోయన నెట్లు విరాజిల్లుచున్నవాఁడో.

సీ. శివభక్తి బోధింపఁ ♦ జిత్తమందుఁ దలంచి
పుట్టిన పార్వతీ ♦ పుత్రుఁడనఁగ
శుద్ధసాత్త్వికగుణ ♦ స్ఫూర్తినిగైకొని
జన్మించు విష్ణుతే ♦ జంబనంగ
ఆకృతిధరించి ♦ యవతరించినయట్టి
సుందరభారవీ ♦ సూనుఁడనఁగ
సకల జనాహ్లాద ♦ చంద్రికా యుక్తుఁడై
జగతిని పుట్టిన ♦ శశియనంగ
విమలగుణముల నెల్లను ♦ కమలభవుఁడు
ఒక్కచోటికిఁ జేర్చి తా ♦ నోర్పుతోడ
బాలరూపంబుగాఁ జేసి ♦ పంపెననఁగ
వెలుఁగుచున్నాఁడు చూడ నీ ♦ విప్రసుతుఁడు.

ఇట్టివానినెట్లు నా లోకమునకుఁ గొనిపోఁగలను. ఆహా! ఏమైనను నావిధిని నెఱవేర్పక తప్పదుగదా. తదేకధ్యానుఁడై నిమీలిత

నేత్రుఁడై పరమేశ్వరమహాలింగసన్నిధింగూర్చుండి శివధ్యానమొనర్చు నితనిజీవముల నెట్లు కొనిపోగలను. ఎట్లైనను వీని చిత్తంబును శివధ్యానంబునుండి మరలించి బాహ్యప్రచారమునకుఁజొన్పి లింగమును విడిచి వచ్చునట్లు చేయవలెను. భక్తిశీలుఁడవగు విప్రనందనా!

మార్కం—(కనులు మూసికొనియే యుండును.)

యము—ఆహా! వీని నిశ్చలత్వము సంస్తవనీయముగదా!

గీ. కనుయుగముమూసి మానస ♦ కమలమందు
నిర్మలాంతఃకరణమున ♦ నిటలనయను
నిల్పి పిలిచిన పలుకక ♦ నిష్ఠతోఁడ
దపముఁ జేయుచునున్నాఁడు ♦ ధాత్రిలోన.

మరియొకమారు పలుకరించెదను. ఓ తపోనిష్ఠాగరిష్ఠుండవగు విప్రనందనా.

చ. కనులరమోడ్చియుర్వ హృదయ ♦ కంజమున న్శివునిల్పి భక్తితో
ఘనతర నిశ్చలత్వమెసఁ ♦ గ న్భజియించుచునున్న యట్టి యో
వినయ వివేకశీల యిటు ♦ వేగమె రాఁగదవయ్య పిల్చుచుం
టిని యరుదెంచి మయ్య యిట ♦ నిల్చి మముంగని మాటలాడుమా.

మార్కం—(కన్నులు తెరచి) ఎవ్వరిట్లు నాజపంబునకు విఘ్నముఁ గలుగఁజేసితిరి. ఓ జగజ్జనకా! మహాదేవా! క్షణమైనను నీ ధ్యానమును విడువఁగలనా! (ప్రక్కకుఁజూచి) ఎవ్వరితఁడు! నీలమేఘచ్ఛాయ నలుదెసలఁ గడలుకొనఁగ దీప్తిపుంజంబులైన నేత్రంబులతో వెల్గొందుచున్నాఁడు. ఇతఁడే నాజపవిఘ్నమునకుఁ గారకుఁడై యుండవచ్చును. ఓ మహానుభావా! తామెవ్వరు? ఏటికిటకరుదెంచి నాజపతపంబుల కంతరాయమును గల్పించితిరి?

యము—విప్రనందనా! నన్ను శమనుఁడందురు. ప్రపంచమందలి జీవుల పుణ్యపాపముల విమర్శించి వారికిఁదగిన పదవుల నొసంగ విధినిర్ణీతుండనై దక్షిణదిశకు నాయకుండనై యుండువాఁడను.

మార్కం—దేవా! యమధర్మరాజవు నీవేనా! శంకరపూజా సమయమగుట నిచ్చటనుండియే నమస్కరించెదను.

యము—కుమారా! అర్థాపదప్రాప్తిరస్తు.

మార్కం—ధర్మరాజా! నీవు మహాభయంకరుండవనియు నీలోకము మహాఘోరమనియు నీదర్శనము నరులకుఁ గానరాదనియు వినుఁవాఁడను. విన్నదానికిని గన్నదానికిని భేదము కన్పట్టుచున్నది.

యము—కుమారా! నీ వనినది నిక్కము. పాపులకు భయంకరుండను. నీవంటి భక్తులకు మాత్రము సౌమ్యరూపమునఁ బరగుచుందును. మరియు నీవు నిరంతర శివపూజా ధురంధరుండవగుటఁ జేసియుఁ గారణజన్ముఁడ వగుటచేత నన్నుఁ గాంచఁగల్గితివి గాని యన్యులకు నారాక యగోచరము. బాలకా! ఇంక నీ వాలింగనమువదలి యీవలకురమ్ము.

మార్కం—అయ్యా! పరేతరాజా!

గీ. నన్నుఁజూడఁగ నేతెంచి ♦ యున్నవాఁడ
వేమి హేతువుకలదొకో ♦ యినకుమార
అంత్యకాలము సామీప్య ♦ మైనఁగాని
ధరణి నీదర్శనఁబడి ♦ దొరుకఁగలదె

యము—(తనలో) ఏల నాచిత్త మిప్పుడు శంకా కులితమగుచున్నది! ఎన్నడును నా హృదయ మిట్టి వ్యత్యాసము నందదే. కాదు కాదు. ఇది నారదవాక్య శ్రవణమువలనఁ గలిగిన మనోవ్యథ. ఇట్టి ధీరస్వాంతునివద్ద దాఁచిన లాభములేదు. (ప్రకాశము) ముని

కుమారా! తెల్పుచుంటిని వినుము. శంకర వరప్రసాద సంజనితుండవగు నీ కామహాదేవుం డొసంగిన యాయు వంతమగుటచే నీ జీవంబులం గొనిపోవచ్చితిని. కావున నీవలకురమ్ము.

మార్కం—అయ్యా! సురితశమనా! శమనా! నీవు ధర్మస్వరూపుండవు. ధర్మపరిరక్షణార్థమై విధిచే నియమింపం బడినవాండవు. అట్టి నీయాజ్ఞకు నేనేమని బదులుపల్కంగలవాండను.

(22 వ అనుబంధము.)

మహాత్మా! ధర్మంబరయ నీవ యర్హుండవు.

యము—విప్రతనయా! కావున నే నేనిట్లు పల్కుచుంటిని. నిన్నిప్పుడు కొనిపోవుట నాధర్మము. నీకిక్కడ నావాక్యములకు బదులు పల్కుట కవకాశమే లేదు. వచ్చియే తీరవలయును.

మార్కం—(లింగముపై చేయివైచి) ధర్మరాజా! విన్యస్తధర్మము నీకొక్కరిదే కాదు. విశ్వజన్మమానవకోటి కెల్లరకు నున్నదియే. అట్టియెడ నాధర్మమును నేనుమాత్ర మనుసరింపవలదా! నేని శంకరసన్నిధిని వదలి నీవెంట రావలెనా?

యము—కుమారా! మానవులకు లోకమునందు జీవితాంతమువరకే విధివిహిత కర్మాచరణము. నీకిక నాయుశ్శేషము లేదు. నిన్ను వేగమే నాలోకమునకుం గొంపోవుటయు నీకర్మ ననుసరించి నీకుందగిన ఫలంబొసంగుటయు మావంతైయున్నది. పలుమాట లేలం బల్కెదవు.

మార్కం—అయ్యా! ఏటి కిట్లాడెదరు! ఉన్నతకులమునందు జన్మించి నందుల కున్నతపదవుల నందయత్నించుటయు జన్మసార్థకమును సంపాదించుటకై యత్నపడుటయేగదా ధర్మము. అట్టి న్యాయము ననుసరించుచున్న నన్నేటికి రమ్మనెదవు?

యము—(తనలో) ఆహా! ఏమి యీబాలుని వచోనైపుణి. వినిన

కొలఁది వినబుద్ధి పొడముచున్నది. వీనిని దల్లిదండ్రుల కెడబాపి వెంటఁగొనిపోవుటెంత కష్టతరము. కానిమ్ము. ఇందు నాచేయఁదగిన కార్యమేమియును లేదు. (ప్రకాశము) బాలకా! ఉన్నత పదవియైనను నీచపదవియైనను నీవు రమ్మనినవచ్చి పొమ్మనిన పోవునవి కావు. నీప్రాప్తి ననుసరించి గానున్న ఫలమువచ్చియే తీరును.

చ. అల శివుఁడైననేమి కమ ♦ లాత్మ చతుర్ముఖులైననేమి నీ
కిల ఫలితంబొసంగుటకు ♦ నెంతటిపుణ్యముఁ జేసియుంటివో
ఫలితమె యంత యీఁగలరు ♦ బాలక దానిని దీసివేయఁగా
గలుగుదురే మరేరయిన ♦ త్మాతలమందు మహీసురాత్మజా.

అయ్యది నీ కనుభవింపక తప్పదు. ఎవ్వరైన నంతకన్న నెక్కుడు ఫలం బీయఁజాలరు. ఏల యిట్టి వాదంబులనాడెదవు. మాతో సంభాషించుటం జేసి మాకాల మతిక్రమించుచున్నది. రమ్మావలకు. జాగుసేయకుము.

(23 వ. అనుబంధము.)

మార్కం—అయ్యా! దయామయ హృదయా! నీ వనినట్లు నాప్రాప్తి యెట్లైనఁగానిమ్ము. నే నీ శంకరలింగమును వదలి నిన్ను జేరఁ జాల. కరుణామయుండవగు నిన్ను వేడుకొనుచుంటిని. నన్ను వదలుము.

యము—అర్భకా విధివిధాయక నాయమార్గంబులకుఁ గట్టువడి కార్యంబులనొనర్చు మాకును గరుణకును జాలదూరము. నీ ప్రార్థంబునకు నాచిత్తము కరుగఁజాలదు. నీవిన్నపమును గట్టిపెట్టుము.

మార్క—కట్టిపెట్టిన నాయక్కర యెట్లు తీఱఁగలదు. నావాంఛితమును నీవు తీర్చినను తీర్పకున్నను నీయందు వినయభావముతోఁ బ్రివర్తింపక తప్పదు. నా యిష్టదైవమగు పరమేశ్వర సాక్షిగా

నిన్ను వేడుకొనెద. దేవదేవుఁడగు శంకరునివీడి నీవెంటరాఁ జాల. నన్ననుగ్రహింపుము

యము—(తనలో) వీనియెడల సామవాక్యములు పనికిరావు. ఇంచుక యాసఁగొల్పి చూచెద. (ప్రకాశము) బాలకా! నీవు నిష్ప్రయోజన వాక్యములతోఁ గాలహరణముఁ జేయుచుంటివి. నీకిది తగదుసుమా శీఘ్రముగరమ్ము.

మార్కం—అయ్యా! నన్నెచ్చటకు రమ్మనెదవు?

యము—నా లోకమునకు.

మార్కం—ఏటికి ?

యము—నీకర్మానుభవము కొఱకు.

మార్కం—ఇదెక్కడనైన గలదా! ధర్మరాజా! న్యాయమునైన విచారింపవలదా?

తే. గీ. ఘనపురోడాశము శునక ♦ మునకుఁ దగునె
యాగశాలార్హతయుఁ వరా ♦ హమున కగునె
పట్టువస్త్రంబు లిలవృష ♦ భమున కగునె
అటులె నేను నీపదవి కై ♦ ట్లర్హమగును.

యము—కుమారా! అట్లు తలంపకుము. యమలోకమని నంతనే దుర్నిరీక్ష్యమై మహాభయంకరముగ నుండుననియుఁ బాపులే కాని యాలోకమునకుఁ బోఁగూడదనియు నీమనంబునకు సిద్ధాంతీకరింపఁ బ్రయత్నింపకుము. నాలోకమందలి నాల్గు ద్వారంబులలో నొక్కదక్షిణ ద్వారమున కావలిప్రదేశమే మహానరకమని తలంపుము. తక్కుంగల పురమంతయు మహావైభవ సమన్వితంబై యొప్పుచుండును. సిద్ధులును మహామునులును సమస్తదేవతలును నాలోకమున కనుదిన మేతెంచుచుందురు. కావున నీవుకూడ రమ్ము. నిన్నచ్చటికిం గొంపోయి యొక దివ్య

విమానమునఁ గూర్చుండఁబెట్టి నీకర్హమగు పదవికిఁ బంపెదను. లెమ్ము కాలవిలంబనముఁ జేయకుము.

మార్కం—అయ్యా! పరేతనాయకా! నాయందు నీకుఁగల్గు కరుణ కనేకవందనములు. నీవన్నవన్నియును నిశ్చయమే. కాని నాకేలయో యీ లింగమును వదలి నీవెంటరాబుద్ధి పుట్టకున్నది. నన్ననుగ్రహించి నీలోకమునకేగుము. నాజపంబున కంతరాయము రాఁజూడకుము. బాలుఁడనగు నామనవిని యింతవినఁజాలవా! నావాంఛితము నీడేర్పఁజాలని యసమర్థుడవా! ధర్మస్వరూపుఁడవగు నీవింత దయాశూన్యుఁడవా?

యము—(తనలో) ఇంతైనను వీఁడాలింగమును వదలి రాకున్నవాఁడు గదా! కానిమ్మని విజృంభించితినా శంకరతిరస్కృతి కలుగునేమో. (ప్రకాశము) కుఱ్ఱా! నీవాంఛితము నీడేర్ప నాతరము కాదు. ఇట్టి విపరీతవరంబును గోరికొనుటవలన నీకించుకైన ప్రయోజనము లేదు నీజీవితాంతమగుచుండ నీజపంబున కంతరాయ మన నర్థమేమి? నేను నీ మొరాలకించినందువలన లాభమేమి? వలయుట్టి వ్యర్థాలాపముల నాడెదవు.

(24 వ అనుబంధము.)

మార్కం—అయ్యా! పోనిండు. పుట్టింపను పెంపను లయింపఁజేయను కారకుఁడై కర్తయై భోక్తయై సకలమును నడిపింపఁజాలు శక్తివంతుఁడగు శంకరుఁడుండ నీకేల యీ విచారము. నీవన్నట్లు నా జీవితాంతమగు తరుణము వచ్చెనేని లయకర్తయగు శంకరుఁడే నాజీవితములను హరింపఁజేయఁగలఁడు. నీ వేటికిట్లుతొందరపడియెదవు?

యము—(తనలో) ఓహో! పిట్టకొలఁది కూత ఘనమాయెనే నేనెన్నఁడు నిట్టి సంశయావస్థను లోఁబడలేదే నారదవాక్యము

చెల్లునా నాపట్టుదల కొనసాగునా? ఇంక దౌర్జన్యముఁ జేసెదను. (పరికాశము) ఓరీబాలకా! నీవు యోగ్యుఁడవనియు శివపూజా దురంధరుండవనియుఁ దలఁచి నే నెంతమృదువుగ సంభాషించి నను నామాటను నీవు వినునట్లులేదు.

(25 వ అనుబంధము)

ఇదివరకు నీయందు నాకుఁగల్గిన సద్భావ మింక మీఁద నుండఁ బోదు. బాగుగా యోజించుకొనుము. నే తలపెట్టిన కార్యమునకు విఘాతముఁగల్గింప నెంతవారికిని సమర్థత లేదు. తెలిసినదా?

మార్కం—యమధర్మరాజా! నీ విట్లాగ్రహించిన నేమిచేయఁగల వాఁడను. న్యాయము నింత విమర్శింపుము. నేనొక్కరియానతి ననుసరించి వారిచే విధింపఁబడిన కార్యముల నొనర్చువాఁడనని నీవింతకుముందే పల్కితివి. ఇంతలో నేల కర్తృత్వమునుఁ బైన వేసికొనియెదవు? అదియునుంగాక

ఉ. అన్నము దైవమాయనుచు ♦ నాకలితో నరుదెంచువారికిన్
సున్నముఁ బెట్టవచ్చుగతి ♦ శుద్ధమనస్కుఁడనైయు మాధవున్
పన్నగభూషుని న్విజత ♦ పర్వతవాసునిజేర నెంచునన్
దిన్నగనేటికీ విటులఁ ♦ దీసుకుపోవఁగ వచ్చినాఁడవో.

యము—ఓరీ మూఢా! దుర్వార పరాక్రమోపేతుండై చతుర్దశ భువన శాసనదక్షుఁడై దుష్టశిక్షణ శిష్టరక్షణ క్రియాసమన్వితుండై లోకబాంధవుఁడును త్రిమూర్త్యాత్మక దివ్యమంగళ విగ్రహుండును నగు భాస్కరభగవానునకుఁ దనయుఁడవగుటచే నిరుపమాన స్వకీయ ప్రభాపటల ప్రజ్వలిత దిగంత లోక త్రయ సమన్వితుండై భయంకరదిర్ఘాత విరావసదృశ సింహనాదకంపిత లోకత్రయస్థిత సకలదుష్టరాక్షసనివహుండై భువనంబుల శాసించుచున్న యమునిబారికిందప్పి దాఁటిపో

యినప్రాణి సృష్ట్యాది నేఁటివరకును బుట్టియుండలేదుసుమా! అట్టి నన్నా నీవు ధిక్కరించునది. నీవింక ధర్మదేవతా తిరస్కారము నొనర్చిన పాపమును బొందెదవుసుమా? దానితో నీకిదివరకున్న పుణ్యముకన్న పాపము రెట్టింపగును. నీవిప్పుడు నాశిక్షకుఁ జిక్కకతప్పదు. నాకవృత్తాంతమింకను నీకుఁ దెలియదు కాఁబోలు. ఇటువినుము.

సీ. ప్రేతకాష్ఠ్యాయుఘోర ♦ భీకరంబై క్రాగు
చున్న తైలఘటంబు ♦ లొక్కచోట
ఘోర కాకోదర ♦ సారమేయ బిడాల
వృశ్చికసంఘము ♦ లిక్కటిల్ల
మింటికెగయుచునున్న ♦ మంటలతో వెల్గు
ఘోరాగ్నికుండము ♦ ల్గూడియుండ
కారుణ్యదూరులై ♦ కశలఁజేఁబూని నా
భటవర్గమెక్కటఁ ♦ బ్రబలియుండ
కాయమును రంపకోతతో ♦ కోయుచుండు
నారలోకవాక గుంపులై ♦ పరిఢవిల్ల
ఘోర కుర్మార్గహృదయసం ♦ కులితయగుచు
వెలయుచుండును నరకంబు ♦ విపరీతనయ.

సురాపానమత్తులై మద్యమాంసభక్షణాసక్తులై పాపాచరణంబునకుఁ జొరఁబడిన నీచులను ఘోరవాయసంబులచేఁ బొడిపించుచుందుము. ఘోరసారమేయంబులచేఁ గరపించుచుందుము. దుర్వ్యసనాసక్తులై విద్యాగంధశూన్యులై స్వజాతీయమతధర్మంబులవదలి వర్ణసంకరంబును బొందిన దుష్టులను నలుగడల మతసాంకర్యమును వృద్ధిఁజేసి పితృదేవతలకు శ్రాద్ధాదికర్మల మాన్పింపఁ జేసిన చెట్టల నెట్టన మట్టగించి ఖడ్గములఁ బొడిపింపఁజేసి బాధించుటకు ఘోరాకారులగు మదీయభటులు

కనిపెట్టుకొనియుందురు. మఱియును దుష్కార్యాచరణసమర్థులై సాధుబాధామహావ్రత దీక్షాసంకల్పులై విద్వాంసులధిక్కరించి ప్రాచీనమత సాంప్రదాయముల నధిక్షేపించి నూతనసంస్కరణ నిర్మాణక్రియా కుశలులమను దురభిమానము తలకెక్క గర్వాంధులై వేదవాక్యములకు విపరీతార్థములఁ గల్పించి వెల్లడించి దేశమునకు దుర్మతములను బోధించు నీచులఁ గ్రిమిభోజనముఁ జేయించుచు నగ్నిస్తంభములఁ గౌఁగలింపఁజేయుచుందుము. స్నానసంధ్యాద్యనుష్ఠానాది సదాచారవర్జితులై మద్యపానమాంసభక్షణాసక్తులై పరిత్యక్తనిజదారులై కులకాంతల వెంటఁబడి తిరిగెడి ద్విజాధముల శూలములఁ గ్రుచ్చి బాధించుచుందుము. కులాచారధర్మములవదలి యనర్థావిద్యాసంపాదనమునకుఁ గడంగి వ్యత్యస్తార్థప్రతిపాదకులై జ్ఞానపామరులై సర్వజ్ఞులమను నహంభావమున ముందువెనుకలరయక జనులకు దుర్బుద్ధులఁగఱపు పాపాత్ములను పట్టికొట్టి సారమేయంబులచే గఱపించుచుందుము. నిజదారసేవ్వొరుఁ వలచియో జనకునిపై క్రోధమునవో జితేంద్రియుఁడు కాకపోయినను సన్యసించి పూర్వకర్మానురూపమైన వాసనల వదలఁజాలక విషయప్రమత్తులై విపరీతవేదాంతవిజ్ఞానప్రబోధనమను మిషచే శాస్త్రవిగతధర్మ ప్రకలంజేబట్టిశిష్యురాండ్రనే కరించి వారిచెంతఁజేరి నిరంతరము తమకున్న యల్పజ్ఞానమును విషయసుఖానుభవరూపమున వెల్లడించి యదియే జీవన్ముక్తియనియు బ్రహ్మానందానుభవమనియు నద్వైతసిద్ధియనియు బోధించెడి కృత్రిమసన్యాసుల నసిపత్రవనములఁ జేర్చి తచ్ఛాఖామధ్యమునఁ బొర్లించి బాధించుచుందుము. కులకాంతలమఱిగి భ్రూణహత్యలంజేయు నీచులను భయంకరముగ మండుచున్న యగ్నికణంబులఁ బొర్లించి బాధింతుము. ఇంక ననేక పాపముల కనేకశిక్షలుకలవు. మార్కండేయా! నీ వింక దేవతాధికారదోషమునకుఁ బాత్రుఁడవయ్యెదవు. నీవు రాకున్న బలాత్కారముగనైనఁ గొనిపోయెదఁగాని యూరకమరలు

వాఁడనుగాను. ఇంక నీవాంఛితంబు నీడేర్ప నా విలయకాలాభీల ప్రచండతర విశిఖశిఖా ప్రజ్వాలాయమాన ఫాలలోచనుఁడగు రుద్రునకైనఁ దరము కాదు.

(26 వ అనుబాధము.)

కావున ర మ్మావలకు.

మార్కం—ధర్మరాజా! నీ యట్టహాసము కడు భీతికరము. నీ వంటి పుణ్యాత్ము లుండుటం జేసియే లోకము నిల్చుచున్నది. కాని నీ యార్భాటమునకు నేనేమియు భయపడను. ఏమందువా! నే నే కుకార్య మొనర్చితినని నీకు భయపడవలయును? మహాపావనమైన పరమేశ్వర సామీప్యము కొఱకై దీర్ఘతపంబొనర్చుచున్న నాకును నీ యట్టహాసమునకును సంబంధమేమియును లేదు. ఏల భయపెట్ట నెంచెదవు ?

యము— బాలకా! నీవు నన్నిట్లు తిరస్కరించుటకు వే రాధార మేమియును లేదు సుమా! నీ వీవలకు వచ్చెదవా లేదా ?

మార్క—అయ్యా! ప్రేతరాజా! నీవు భ్రమపడుచుంటివి సుమా! ధర్మ స్వరూపుడవై ధర్మ రక్షకుఁడవై ధర్మ పరిపాలనార్థమై విధి నిర్ణీతుఁడవై నిలిచియున్న నీ యట్టివాఁ డిట్టి యసమంజస వాక్సరణి నుపయోగింపనా! ఎంత మాటాడితివి ? ధర్మము నిలుచుట కాధారమే లేదా న్యాయమునకు నిలువ నీడయే లేదా సన్మార్గ సంచారులకు నీకన్న వేరు శరణ్యమే లేదా ? ఇది నీవు మనస్ఫూర్తిగ నాడిన మాటయేనా! నీ విప్పట్టున నింత పొరపడితివో యోజింపఁగొనవలదా నేనెట్లు నిన్ను తిరస్కరించితిని ? నే నాడిన మాటలయందు భవదీయ తిరస్కారమెట్లేర్పడియె ? పరమేశ్వర సన్నిధిం బొందఁ గోరితిననుట తప్పా! గిరిజా మనోహర సాక్షాత్కారమును బొందఁ గోరితి

ననుట దోసమా ! యమలోకము వదలి కైలాసమునే నివాసస్థానముగఁ గోరితినను టధర్మమా ! విప్రకులమున జన్మించినందులకు శివునిగూర్చి తపముఁ జేసికొనుమఁ గైలాసమున కేగెదను గాని యమలోకమునకు రాననుట తప్పా! మహనీయుడవగు నిన్నుఁగూర్చి నేననుట దోషమని సంశయించితిని గాని నీ వొనర్చిన ప్రమాదము సామాన్యమైనదియా శివునిగూర్చి తపముఁ జేసికొనుచున్న నా జప తపముల కంతరాయమును గల్పించి నాధ్యానమును భంగపరచి శంకరభక్తునకపచారము సలుపలేదా ! ఉమా మనోహర దాసుఁడనగు నాకు నా మనస్సునకు చంచలత్వమును గల్గించి తపోవిఘ్నంబును సమకూర్చితివే. ఇందువలనఁ బరమేశ్వరునకు గోపము కలుగదా ? భక్తావనపరతంత్రుఁడగు శివుఁడు దీనిని సహించునా ! మహాత్మా ! నీ ప్రమాదమును నీవు తెలిసికొనక మీఁదు మిక్కిలి నన్ను దిరస్కరించితిననియు నట్లొనర్చుట కాధారము లేదని నిష్ఠురములాడ నుపక్రమించితివి. నా వాక్యములు సత్యములని నిర్ధారణ మొనర్చుట కనే కాధారములు కలవు. ఇటు వినుము.

సీ. ఇలను మానవకోటి ♦ నెల్లవేళలఁగాచు
ధర్మంబ దొక్కటా ♦ దరువుకాదె
విధ్యుక్తకర్మల ♦ విధియించి చేయించు
సురకృప యొక్కటా ♦ దరువుకాదె
హితమార్గమును జూపి ♦ సతమేగుమని పల్కు
గురుకృప యొక్కటా ♦ దరువుకాదె
అంతదూరంబేల ♦ నఖిలంబుఁ గాచు శం
కర దయ యొక్కటా ♦ దరువుగాదె

నను బరీక్షింపఁదలచితే ♦ మనమునందు
నీకు మాత్రము తెలియదే ♦ నిక్కమైన
మార్గ మిదియని కాన ధ ♦ ర్మస్వరూప
యేటి కీరీతిఁ బలుకఁగ ♦ నేమిఫలము.

మఱియు నోధర్మరాజా! ఇటు వినుము.

చ. భరభవబంధసంఘములఁ ♦ బాపి మహాదురితౌఘ దూరమై
శరణని నమ్ము భక్తులకు ♦ సంతత మాదరువై వరదాయకంబునై
సురగణ సన్నుతాతిశయ ♦ శుద్ధ యశోవిభవాన్వితంబునై
పరగు మహేశు నామము శు♦ భంబగు దిక్కగు నాకు ధాత్రిలోఁ.

మృత్యుంజయుండగు పరమేశ్వరుని గూర్చి తపం బొనర్చుచున్న నన్నెట్లు గొని పోగలవయ్యా? ఇంత యన్యాయమా? ధర్మ గౌరవము నశించెనా? ధర్మపాలకుఁడ వని పేరును వహించిన నీవే యిట్టి కట్టడి కృత్యంబును జేయ సాహసించెదవా? ఇదే నాప్రతిజ్ఞను వినుము. ఉమానాథ రమామనోహర వాణీనాయక శచీహృదయేశ్వరాధి దేవ ప్రభృతులు పరివార సమేతులై ధర్మ రక్షణార్థమై యిటు వచ్చి సాక్షీభూతులై నిల్తురుగాక. జగంబు ధర్మావతారంబు గదా! పరమేశ్వరుఁడు తన్మయుఁడుగదా. ఈ తరుణమున నన్నేలఁ గాపాడరాడో పరిశీలింపవలసినదే. ఆపన్నివారకుఁడగు శంకరుని వదలి నీవెంట రాఁజాల. ఇదియే నిర్ధారణము

యము—ఓరీ! దుష్టా! ఎట్లైనను గాలయాపనముఁ జేయ నెంచెదవా. నీ కుటిలత్వము నాకడ సాగదు. భృకుటీ విక్షేపమాత్రమున జగంబులను నడంకఁ జేయుచు ప్రాణికోటి నెల్లను మదీయ నామోచ్చారణ మాత్ర భయసంచలిత హృదయాంతరంగులనుగా నొనర్చి ప్రచండతరముగ సంచరించుచున్న నన్నీరీతిఁ దిరస్కరించి నందులకుఁ దగిన ఫలితము నందెదవుగాక. నీవా

లింగమును వదలకున్నచో నేను నీ చెంతకు రాలేనని తలం చితివేమో యట్లైన్నటికిని దలపోయకుము. నీ జీవితమును గొనిపోవుట నాకార్యమై యుండ శంకరుఁ డెన్నటికిని నీకుఁ దోడ్పడఁ జాలఁడు. నీ వా యాసకుఁ జిక్కక రమ్ము. లేకున్న నిన్నా లింగంబుతోఁ గూడ బంధించుకొని పోయెదగాక.

(అని పాశమెత్తును.)

మార్కం——(లింగమును కౌగలించుకొని) హా పరమేశ్వరా! నీ భక్తుని సంరక్షింప నిదే తరుణము. మించి పోవుచున్నది రక్షింపుము.

(27 వ అనుబంధము)

మ. ధరపైపుట్టినదాది నీదగుపద ♦ ధ్యానమ్ము నీసేవ నే
మరక న్జేయుచునున్నవాఁడగద నీ ♦ మహాత్మ్య మింతేని నా
కెఱుఁగ న్శక్యమె దేవదేవ వరదా ♦ యాశా దయాపూరితా
నిరతంబు న్నెఱనమ్మితి నిను ధర ♦ న్నిక్కంబు మృత్యుంజయా.

యము——ఓరీ! దుష్టబాలుఁడా! వచ్చెదవా లేదా?

మార్క——శమనా! ఎన్నిమార్లు తెలుపవలయును.

గీ. పాపనపదమగు శంకరా ♦ ర్చనమువదలి
యేటి కరుదెంచువాడ నీ ♦ వికమీఁద
మాటి మాటికిఁ గుటిల సం ♦ భాషణమును
మాని పొమ్మిక నీతోడ ♦ రాను రాను.

యము——నిష్కారణముగఁ జెడక నీవుగా లేచిరమ్ము.

మార్కం——నాచింత నీ కేమియును వలదు. నా చింతం బాపఁ బర మేశ్వరుఁ డున్నాఁడు.

యము——ఓరీ! కాచికొనుము. పాశమును దగల్చుచుంటిని.

(28 వ అనుబంధము.)

[అని పాశము లేసి లింగముతో బంధింప లింగ మధ్యమునుండి శంకరుండు ప్రత్యక్షమగును.]

శంక—ఓరోరి సదాచార వివేక శూన్యా! అధికార గర్వోన్మత్తా నా భక్తుని దిరస్కరించెదవా?

[అని శూలముతోఁ బొడువ యముఁడు కూలును.]

మార్కం—(చేతులు జోడించి) మహాదేవా! రక్షింపుము. నీభక్త వాత్సల్యమును నేఁడుగదా కంటిని.

(29 వ అనుబంధము.)

[బ్రహ్మ, వశిష్ఠులు ప్రవేశింతురు.]

బ్రహ్మ—దేవాదిదేవా! మహాదేవా! శాంతింపుము. నీవు కోపించిన లోకములు తల్లడిల్లుచున్నవి. అజ్ఞులమగు మేము నీ మహిమను తెలిసికొనఁ గలవారమే! గౌరీమనోహరా! నేటికిగదా చూడఁ గంటిమి.

వశి—జగన్మయా! లోకసాక్షివై యజ్ఞకర్తవై నిరహంకారుండ వయ్యును భక్తసంత్రాణకార్యార్థమై సాహంకారుఁడవై చెలంగు మహాదేవుఁడవు.

శా. నీవే సర్వజగన్మయాత్మకమహా ♦ నిష్ఠా సమేతుండవై
శ్రీవాణీశ పురందరాది సురసం ♦ సేవ్యుండవై యొప్పు ని
న్నేవా మా కెఱుఁగంగ శక్యమగునా ♦ నిత్యుండ వీవేగదా
భావంబందుఁ దలంచి మ్రొక్కెదము కా ♦ పాడంగదే శంకరా.

మహానుభావా! ఈ యముండు విధ్యుక్త కార్యాచరణుఁ డగుటచేనంత వ్వాఁడు.

బ్రహ్మ—శంకరా! వీని నిట్లు పడఁగొట్టుటవలన లోకములకుఁ గీడు వాటిల్లును. పుణ్యపాపవిమర్శనము తగ్గును.

శంక—వశిష్ఠా! పితామహా! ఈ యముఁడు నియమితకార్యకరుఁడ య్యును నన్ను దిరస్కరించి మద్భక్తుని బంధించుటచే శిక్షింప వలసి వచ్చెను. ఇఁకనైన బుద్ధిఁ దెలిసికొని సంచరించుఁ గాక. శమనా! లెమ్ము. (లేవదీయును.)

(యముఁడు లేచును.)

(నారదుఁడుఁ మృకండుఁడు, మరుద్వతియుఁ బ్రవేశింతురు.)

నార—ఆహా! నేఁడెంత భాగ్యము. మృకండమరుద్వతులారా! భగవానుఁడగు చంద్రమౌళి సాక్షాత్కరించియున్నాఁడు. నమస్కరించి మృత్యుంజయ విలాసమును జూతమురండు.

(30 వ అనుబంధము.)

(సమీపించి.)

గంగాధరా! ఇతఁడెవ్వరు? యముఁడేనా?

యము-ఈ నారదుఁడు తన వెకసక్కపు పురాణమును విప్పుచున్నాఁడు. ఇదంతయు వీనిమాయయని యెఱుంగక మోసపోయితిని.

నార—ధర్మరాజా! ఇట్లుంటివేమి? ఈమార్కండేయులు నీలోకమునకు రానన్నవాఁడా యేమి అంతమాత్రమున నీవూరకుండవే? ఏలయిట్లు విన్ననైయుంటివి. నీయత్నము సఫలము కాలేదా?

యము—(తనలో ఈ పరిహాసవాక్యములు శూలఘాతలకన్న నెక్కువగ బాధించుచున్నవి. ఈశంకరుఁడు నన్నట్లే పడియుండనిచ్చిన మేలుగ నుండెడిది.

నార—ధర్మరాజా! నూరాడవేమి? నాడు నాతో నేమంటివి? మార్కండేయుని గొనిపోకున్న నన్ని పేరునఁ బిలువవలదంటివే? ఇప్పు డేమనిపిలువవలయును? తెలిసెనా శివభక్తుల ప్రతాపము?

యము—దేవాదిదేవా! శేషాహిభూషణ! మందుఁడనై తెలియక జేసిన నేరమును సైరింపుము. ఇకమీఁద శివ కేశవపాదభక్తుల

చెంతకైనఁబోను. మార్కండేయా! నీవలన నీశ్వరమాహాత్మ్యమును దెలిసికొంటిని. మృకండమునీంద్రా! నేటికి నాప్రమాదమును గ్రహించితిని.

మరు—తనయా! మృత్యువిహీనుఁడవైతివిగదా.

మార్కం—అమ్మా! జననీజనకులరగు మీదయవలనను శివానుగ్రహము కల్గిన నారదముని ప్రయత్నఫలితమువలన భయములన్నియుఁ దొలఁగెను.

నార—పితామహా! మృకండా! మానవులకైననేమి దేవతలకైననేమి దానవులకైననేమి? కర్మఫలితమనుభవింపక తప్పదు.

గీ. కర్మ మనుభవింపక పోదు • కల్పకోటి
వత్సరమ్ములకైనను • వసుధలోన
మంచిదైనను జెడుగాని • సంచితమ్ము
ననుభవింపనే వలయుఁ ద • థ్యంబు సుండి.

ప్రేతరాజా! నీ యహంభావ మడఁగెనా?

యము—సర్వము నశించెను.

శంక—మార్కండేయా! ఇటు రమ్ము. (తలపై చేయియుంచి)

గీ. తరణి చంద్రాదు లున్నంత • వరకు ధరణి
షోడశాబ్ద జీవితుఁడవై • శుద్ధమతిని
దిరుగుచుండుము లోకోప • కరుఁడవగుచు
సర్వశుభములు నీకబ్బు • సత్యమిదియు.

నేటినుండియుఁ దల్లులు తమ బిడ్డలను నీ పేరున దీవింతురు గాక!

అందరు—తథాస్తు. (మంగళము.)

తెర పడును.



# మార్కండేయనాటకము.

## .అనుబంధములు.

ఈక్రింది యనుబంధముల సంఖ్య తప్పులుపడుటచే పేజీనంబరు కూడ చేర్చబడెను గాన నటకులు జాగ్రతగా కనుగొనవలెను.

1 పేజీ. 1 వ అనుబాధము.

నారదుడు— మోహన—త్రిశ్రగతి ఆది.

గంగాధర హరహరహరశంభో। కలుష దురితవారణా॥ గం॥

పావనచరితా నీదగు - పరమమూర్తి పరనమునన్ । బ్రహ్మానందము కల్గెను । ధన్యమయ్యె నాజన్మము । పరమపురుష సురవినుత పాపటవీదహావ॥ గం॥

---

2 పేజీ. 2 వ అనుబంధము.

నారదుడు— బేహాగ్—ఆది.

జయజయ పశుపతి జయజయ శూలీ । జయజయ నుతవనమాలీ । జయ నిగమాగమ మార్గవిహారి । జయ గోపాలహరా॥ జ॥

పాతకసంహారణా సుచరణా । వరకరుణాభరణా । సుచరణా వరకరుణాభరణా॥ జయ॥

---

2 పేజీ. 3 వ అనుబంధము.

మృకండుడు— ముఖారి—ఆది.

ఎంతటి దైన్యము - నందగవలసె ।
ఇంతిరో నాకట - నేమని తెల్పుదు॥ ఎం॥
సాటిమునులలో - సంతుగజాలని ।
కేటి వ్యర్థుడనైతి - బోటిరో నే నిక॥ ఎం॥

10 పేజీ. 4వ అనుబంధము.

నారదుడు—　　　　　బేహాగ్—ఆది.

నీపదభక్తుడనో - పశుపతీ నీలగళాన్విత నా । పాపముల్ - బాపుము శుభసదనా । జయజయజయజయజయ గౌరీశా । జయ గోపాలహరా। జయ సకలాగమ మార్గసంచారా । జయగోపాలహరా॥

---

11 పే. 5వ అనుబంధము.

మృకండుడు—　　　　　శంకరాభరణము—ఆది.

వందనము - వందనము శుభచరితా వరతపోధనాన్విత॥ వం॥ నిరుపమ సుచరితమానివరా । నీరజాక్షు పదగానవిలోల॥ వం॥

---

12 పేజీ. 5వ అనుబంధము.

నారదుడు, మృకండుడు—　　　　　మాయామాళవగౌళ—ఆది.

హర హర హర శంభో - మహాదేవ గంగాధర శరణు శరణు భవ॥ హర॥

భావమందు నిను దలంచుచునుంటిని పరమకరుణ గనరాదా । నను గావగ యింకరారా దా । నీవాగమంటిమేకాదా । పరమపాదా విదితవేద । పోషిపగావా॥ హర॥

---

13 పేజీ. 6వ అనుబంధము.

మృకండుడు, మరుద్వతి—　　　　　హిం. కాఫి—త్రి-ఏక.

కాంతా భయంకరమగు । కాననమును కనులలరగ । ముదమొసంగెడి చూడుమా । చూడుమా॥ మనమున కతి సమ్మోదమ్మొసగుచుండె నిదె కనుమా॥ కాం॥

మరు—తాల సాల హింతాల రసాల మహా భూజసమితి । తద్దయు మానసమున కానందము పురికొల్పగా । ధరణిజములు చందము

గన । నా । కాహా । పలుగతులను మనమునకును । విభ్రమ మది కలిగించెే॥ నాథ॥

18 పేజీ. 7వ అనుబంధము.

మృకండుడు— నాదనామక్రియ—ఆది.

పాహినమస్తే - భావజారే । పాలయమాం । పరమపురుష॥ పా॥
దీనపోష । దివ్యవేష । దేవదేవ । దివ్యప్రభావ॥ పా॥
పాపనాశ । పార్వతీశ । భక్తపోష । భవ్యవేష॥ పా॥

21 పేజీ. 8వ అనుబంధము.

కళ్యాణి—రూపకము.

దేవీ మహేశ్వరి । మాదిక్కు-చూడుమా । జనని॥ దే॥

పావనితుహి - నాద్రినిలయే । భక్తలోకపోషిణీ । పాపలోక విధ్వంసిని । పాలితత్రిభువని । గుణమణి । సకలభువన పరిపోషిణి । సకలపాప విధ్వంసిని । సర్వవిబుధ సమ్మోదిని । సంతతానందదాయని॥

24 పేజీ. 9వ అనుబంధము.

మరుద్వతి— బేహాగ్—ఆది.

రారా నాకుమార । రమ్యగుణాధార కుమారా । రమ్యగుణాధారా॥ రారా॥

మారాకారా । మందస్మితధర । కుంజులగుణాబృంద । సుకుమారా । మంజులగుణాబృంద॥ రారా॥

25 పేజీ. 10వ అనుబంధము.

మార్కండేయులు— బేహాగ్—ఆది.

సంతసమాయెను నాతల్లీ । స్వాంతమునకు సంతసము కల్గెనేడు॥

పుణ్యకాంతలకు వందన భాగ్యము । పూర్వపుణ్య వశమునగాదా। ముక్తిబొంద సాధనమదిగాదా॥ సంతసమాయెనుగా మాతా । జన్మ సార్థకము సంభవించె నిక॥ సం॥

27 పేజీ. 11వ అనుబంధము.

కళ్యాణి—ఆ

సదా మదిని భజియించెద శ్రీధర । సకలలోక పాలకవినుత॥ వేమారు విన్నవించుచునుంటిని పామరత్వ మెడ బాపుము శంకర॥ స॥

మహామహులు నీ మహిమల గన్గొన । నేరరైరి గౌరీనాథా । మాననీయ నా మానసపీఠము బాయకి య్యా సర్వేశ్వర హరహర॥ స॥

34 పేజీ. 12వ అనుబంధము.

బాలురు— బేహాగ్—ఆది.

జయజయజయ గోపాల పురారీ । జయజయజయ రజతాద్రి విహారీ॥ జయ॥

దేవదేవ చిన్మయస్వరూపా । త్రిపురాసుర ప్రాణానిలసంహార । దివ్యయోగిమానస సంచారా । కనుగొనరారా । బ్రోవవిదేరా । మన సిజసంహార । పాపహారా । దలచితి రా । కేందుధరా॥ జయ॥

37 పేజీ. 13వ అనుబంధము.

బాలురు— నవరోజు—త్రిపుట.

శరణు శరణు నీలకంఠ । పాపహరా, దీనాధారా । మారహరా॥

కామితఫలదాయక హో । కల్మషముల బాపుమా - గరళ ధరా । పశుపతి రాకేందు ధరా । శంకరా, నిటలనయన నినుదలచితి నయ్యా । భావాతీతా । మారహర॥ శరణు॥

38 పేజీ. 14వ అనుబంధము.

మరుద్వతి— నాదనామక్రియ—ఆది.

నాయనా నాతనయా । నాపెన్ని ధానమూ॥ నా॥

నినువీడి నేధర । నిలువగ నేర్తునే । మనసిజసమనిభ । మంజుల వేష॥ నా॥

ఏగతిసైచెవ । నీశోకంబును । ఎవ్వరునాసుతు । గాచెడివారలు॥

---

40 పేజీ. 14వ అనుబంధము.

మార్కండేయులు— కాఫీ—ఆది.

మృగధర సురవరనుతపదసరసిజ । మృడాసీశ గజచర్మాంబర ధర ఈశ। లోకపాలక చంద్రిమకుట॥ మృ॥

పరమపురుష యఘుసంహారణా । పంచవదన మన్మధహననా । పాలింపుము నను భవతరణా । వరములొసంగుము వృషగమన॥ మృ॥

---

43 పేజీ. 15వ అనుబంధము.

మార్కండేయులు— బిళహరి—ఆది.

ఎన్నగ మనతరమే । పరమేశు నాజ్ఞ నీధారుణిలోపల॥ ఎ॥

అహంభావమును వహించుచును యహారహంబు । నరులిలఁ దిరిగదరే । మహాదేవు నాజ్ఞలేక ధరలో । మృత్యువైన చేరగలదె । మనలను॥ ఎన్న॥

---

44 పేజీ. 16వ అనుబంధము.

నారదుడు— హరికాంభోజి—ఆది.

పాతకసంహరణా । సుచరణా । పాలిత విబుధగణా । సుచరణా । పాలితవిబుధగణా॥ పాత॥

జయజయజయజయ చంద్రార్ధమౌళీ । జయ గోపాలహరా
జయ సకలాగమ । మార్గవిహారీ । జయ పురదైత్యహరా॥ పా॥

49 పేజీ. 16వ అనుబంధము.

హిందూస్తాని తోడి—ఆది.

మార్కండేయుడు—సెలవొసగుడీ । మునులు ననుకొని చనెద రిక॥ సెల॥
జనని జనకులార నే నీ । తరుణమున జని యరుదెంచెద నిక॥

మరు—పోయిరమ్మా నా। తనయ నిన్నికన్ సకలసురులు దయంగ నెదరు।
శుభమగు నిక మునులతో జని । రమ్మికన్॥

మృకం—పోయిరమ్మా నాతనయ నీవికన్ । శంకరుండు నీ । జీవితముల
నిక । పెంపుజేసి । దయ మనుచును । గావుత॥ సె॥

49 పేజీ. 17వ అనుబంధము.

వశిష్ఠ, నారద, మార్కండేయ. హరికాంభోజ—ఆది.

నీపదభక్తుడనో । నిటలాక్షా । నీదయగోరితినో । హరహరా ।
నీదయగోరితినో జయజయజయ కం । దర్ప సంహారా । జయగిరిజా
రమణా । జయ త్రిపురాంతక మృగధరశంభో । జయగిరిజారమణా॥

54 పేజీ. 18వ అనుబంధము.

నారదుడు— బిళహరి—త్రిపుట.

తెలిసికొనగ దరమౌనే । త్రిపురాంతక చరితంబున్॥ తె॥

పరమపురుషు డగువాడు । భక్తజనావనయ సులభుడు । పంక
జాసన నుతుండు పార్వతీమనోభవుండు । వరదుండు । కరుణాళుడు
దీనదయాపరు డగు శివు॥ తె॥

59 పేజీ. 18వ అనుబంధము

యమునను— శంకరాభరణస్వరములు—త్రి - ఏక.

చాలుచాలు నీవికేల । వల్కెద వికె నారదా । మేలమాడు । చుంటివో నీ మనమునకును । తెలియదో॥ చా॥

ఏటికి నీ వీనాడు । ఈగతిపలికెద విందు మేటిదైన శమనుని బల । మెరుగవె జగమందున॥ చా॥

62 పేజీ. 19వ అనుబంధము.

యమును— శంకరాభరణము—ఆది.

ఇదిగోచనెదన్ । జగతీస్థలిలో । గొని తెచ్చెదనా। ప్రాణంబుల్॥ పరమశంకరుండైనను ధరలోన్ । భార్గవీసుడైనన్ తోడుచూడగా రాగ లరే యా । విప్రకుమారునకున్ । దేవమునులు మెచ్చన్ । నే । గొని తెచ్చెద నాజీవంబుల్॥ ఇ॥

62 పేజీ. 20వ అనుబంధము.

నారదుడు— ఆనందభైరవి—ఆది.

పాలి మమా । పార్వతీహృదయేశ॥ పా॥

పాలింపకున్న । పరు లేరుదిక్కు । పంకజాసననుత । పరమానం దధామ॥ పా॥

పలుమారు నీ। నామమంత్రమును భజనజేసెదను । గంగాధరా॥

భక్తబృందపాల । పార్వతీ హృల్లోలా । వందితాఖిల । భువన జాల । శంభో॥ పా॥

### 63 పేజీ. 20వ అనుబంధము.

మార్కండేయులు— శంకరాభరణము—మిశ్ర-ఆది.

శ్రీషణ్ముఖజనక । బాలశశిశేఖ రార్ధనారీశ్వర ।। భవహర పురహర । పరమశుభసదాశ్రిత॥ వేదాంతవిదితాఖిలకారణాకారక । శ్రీమన్మహామానీశ్వర సన్నుత వరవాణీశ సురార్యపూజిత । పాద లోకరక్షక కరి । నమామి దేవదేవ దివ్యభావ॥ శ్రీ॥

శ్రీద సకల విబుధసురగణ । మునిగణవినుత సుచరణ । శశిహాసితమకుట దనుజహరణ । పరిశోభిత త్రిభువన । నవవసన త్రిపురసురరిపుహరణ మదనహనన । నిరాభాస నిరంజనా । నిర్వికార॥ శ్రీ॥

చ॥ నామితే చరణయుగళే । మునిమానస సంవాస శ్రీ । పంచవదన ఫణిసమూహాభూషణ। పార్వతీ రమణోరగ సన్నుత । నిష్కామ । నిర్ద్వంద్వ॥ శ్రీ॥

---

### 64 పేజీ. 21వ అనుబంధము.

యముడు— శారువ—ఆది.

ధారుణిని నాశాసనమునకును । వేరుకల్గునె యోజింపర । మానవుడయిన దానవుడయినన్ । దాటగలరే యోజింపర । భువనములన్ । ప్రళయమునై । తనరుగదా । జీవులకెల్లెడ॥ ధాత్రి శ్రీగతి॥

నరులనగను దలపగా । కడుసుకరులుగారె న । న్యావరమున। మారువలికి । నిల్వగలరె మాని తా । నిటులనగను జెల్లునా । ఇదె వీని గొనిపోవనా॥ ధా।

---

### 67 పేజీ. 22వ అనుబంధము.

మార్కం— కళ్యాణి—ఆది.

ఈవిధమున బంధకగుణ నెవి । శోకమునా । జగతి నాటుల । సను గొనిచన॥ ఈ॥

పరమశివుని నే। నిలాతలంబున । శరణమనుచు మది । నమ్మితి గాదా । ధర్మపాలకుడ । నై జరియించెడి । ధర్మమూర్తివగు నీకిది తగునా॥ ఈ॥

---

68 పేజీ. 23 వ అనుబంధము

యము— కేదారి—ఆది.

వలదు వలదు నీ । విటులబల్కినను । ఫలములేదికను । కను గొనుమా। ఇది వినుమా తగదుసుమా । కదలిర మ్మికను భూసురతనయా॥
మార్కం—ఏలనీగతిని । వచియించెద విది హితముకాదు నీ - కినతన యా ధృతసదయా॥ వ॥
పరమశివుని సత్కరుణను గోరెడి బాలకుడని నను । తెలియవో॥

యము—చలంబునర । నీవిక । జాలముచేసిన ఫలమేమి॥

మార్కం—నీవెంటనే రాగతమేమి । తెలుపుమయా॥

యము—తగదయ్యా॥ వల॥

---

70 పేజీ. 24 వ అనుబంధము.

శంకరాభరణ స్వరములు—త్రిపుట.

యము—రమ్మిటకు కుమారా।

మార్కం—వాదమాడమేలా।

యము—పలుకులుడిగి తొలగవే।

మార్కం—పంతము లికమానవే॥

యము—రమ్మి॥

మార్కం—పరమశివుని లోకంబును నేకోరినవాడర।

యముడు—కరుణవదలి నాలోకమునకు గొనిపోయెదను - వాడఁక।
మార్కం—దయనుగను జగాన।
యము—రమ్మిటకు బిరాన॥ ర॥

---

71 పేజీ. 25 వ అనుబంధము.

యముడు— హిం- కాపీ—ఆది.

ఇటుల పల్కగను । తగదుసుమా । పలుమరు పిలిచితి । రయ
మున లెమ్మిక॥ ఇ॥

చాలుచాలు ధీరుఁడవయి నీవిఁక మేలమాడ స్వాంతమందు న
లచితో । జాలమిటుల సేయనీదు మనమున । నేమని కడువడిదలఁచితి గో
పాలుఁడనుచు నిన్ను విడువఁజాలను । చాలునిక చాలునిక । రమ్మిట॥ఇ

---

74 పేజీ. 26 వ అనుబంధము.

యముడు— శంకరాభరణము—ఆది.

కుటిలమతిని నీ । విటులబలికెదవె । నిను గొనిపోవక వదలు
దునా। వలదుసుమా చెడియెదు । మాటలవిని నావెంటనెరమ్మా॥ కు॥

వాదమాడ నా తోడగాదికను । పంతగించినను ఫలమేమి । పం
కజాసను డైననుగానీ । రుద్రుడైన నిను । రక్షింపగలడా॥ కు॥

---

77 పేజీ. 27 వ అనుబంధము.

మార్కండేయులు— కళ్యాణి—రూపకము.

కావగ నను । తరుణమిదియె గద - శ్రీ శంభో॥
ఆపన్నుఁడనైతిని నా । యార్తిదీర్చి శంకరా॥ కా॥

పరమపురుష - వరశుభంకర । పాపహరణ - భవతరణా ।
భుజగభూషణ - భక్తపోషణ । బ్రోవవె నను - భయముబాపి ॥

### 77 పేజీ.    28 వ అనుబంధము.

యముడు—                                    శంకరాభరణము—ఆది.

ఓరికురాత్మా । ఇంత కావరమ ననుదిరస్కరించెదవోరా । ధారుణిలోన నిరాదరణంబును జేసెదవే పాపాత్మా॥ ఓ॥

నాదగు పాశముచే నిన్నుఁ । బంధించెద నేనికమీఁదఁ । నిన్ను గావఁగా రాఁగలరెవరో । పీడింతు న్దుష్టాత్మా॥ ఓ॥

### 78 పేజీ.    29 వ అనుబంధము.

మార్కండేయులు—                                    కామవర్ధని—ఆది.

గానలోల శ్రీ కరుణాలవాల॥

దానవాంతకా నన్ - దరిఁజేర్పవేర । జ్ఞానదాయకా దరి । జేర్పుమయ్యా । గా॥

నీవు లేని తలము - నిఖిలలోకములను నీలకంఠ వెదకి కనజాలమయ్యా । నీరజాక్ష వినుత నెనరుంచవయ్యా । నిఖిలలోకరక్ష చిన్నికృష్ణ వినుత ॥గా॥

### 79 పేజీ.    30 వ అనుబంధము.

మంగళము.                                    హిం - కాపీ—ఆది.

మంగళమిదె కొను । శరదాభ్ర దేహ మంగళమో గౌరీనాథా॥మం॥

చర్మాంబరధర । శంకర హర హర చిన్ముద్రాంకిత శోభిత దేవా॥మం॥



# ఆంధ్రనాటకములు.

| | |
|---|---|
| నవరత్న చింతామణి | 1-0 |
| అనసూయ | 1-0 |
| బొబ్బిలియుద్ధము శ్రీ॥ కృ॥ | 1-0 |
| వేణీసంహారము వ॥ సు॥ | 1-0 |
| విక్రమోర్వశీయము ,, | 0-8 |
| చండకౌశికము ,, | 0-10 |
| అభిజ్ఞాన శకుంతల ,, | 1-0 |
| సంపూర్ణోత్తర రామాయణం | 1-4 |
| కుశలవ వి॥ సు॥ | 0-12 |
| సారంగధర | 0-12 |
| సువర్ణపాత్రి రా॥ నా॥ | 1-0 |
| సుమతీదేవి బ॥ కో॥ | 0-12 |
| సంపూర్ణ భారతము పిం॥ వ॥ | 1-4 |
| భక్త కబీర్ కో॥ సు॥ | 1-0 |
| పాదుకాపట్టాభిషేకం | 1-0 |
| శ్రీకృష్ణ తులాభారము | 0-12 |
| కనకతార | 0-10 |
| సౌగంధికము గుం॥ బ॥ | 0-8 |
| మాతృదాస్యవిమోచనము | 0-12 |
| సంస్కారిణి దా॥ పుం॥ | 1-0 |
| సత్యహరిశ్చంద్ర కా॥ వీ॥ | 0-12 |
| లంకాదహనము | 0-8 |
| ప్రతిజ్ఞాపాండవము | 0-12 |
| గర్వభంగము | 0-10 |
| పసజ్బకావళి | 1-0 |
| మహానంద కో॥ సు॥ | 0-12 |
| చింతామణి రా॥ నా॥ | 1-0 |
| మహానంద | 11 0 |
| సావిత్రి ద్రో॥ సీ॥ | 0-12 |
| కన్యకాపరమేశ్వరి కా॥ సా॥ | 1-0 |
| రంగరాయ కదనము | 1-0 |
| చిత్రనళీయము బ॥ క్రి॥ | 1-0 |

## హరికథలు.

### బి. బాలాజీ దాసుగారివి.

| | |
|---|---|
| నలచరిత్ర | 0-8 |
| గయోపాఖ్యానము | 0-8 |
| జయప్రద | 0-8 |
| రుక్మాంగద | 0-8 |
| కుశలవ | 0-8 |
| ద్రౌపదీమానసంరక్షణం | 0-6 |
| కర్ణానందదాయిని | 0-6 |
| పురందరదాసు చరిత్ర | 0-6 |
| సూరదాసు చరిత్ర | 0-6 |
| ప్రియంవద చరిత్ర | 0-6 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | 0-6 |
| హాటక క్షేత్ర మహిమమంజరి | 0-8 |
| డిటో రెండవభాగము | 0-6 |

### ఆ. నారాయణదాసుగారివి.

| | |
|---|---|
| సావిత్రిచరిత్రము | 0-12 |
| మార్కండేయ | 0-12 |
| జానకీశపథము | 1-0 |
| భీష్మచరిత్రము | 0-8 |
| అంబరీషచరిత్రము | 0-8 |
| గజేంద్రమోక్షము | 0-8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | 0-12 |

కందుల గోవిందం,
బుక్కు సెల్లరు అండ్ పబ్లిషర్,
బెజవాడ, కృష్ణాజిల్లా.